# బాలానంద బొమ్మల భాగవతం

పురాణపండ రంగనాథ్

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ ........................ విజయవాడ - 2

నాన్నగారు అందించిన
ఆధ్యాత్మిక వారసత్వానికి
ప్రతినిధిగా నిలిచి,
మమ్మల్నింత వాళ్ళను చేసిన
భాగవత దీక్షామూర్తి మా అన్నయ్య
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తికి
ఇది అంకితం చేస్తున్నాను.

—రంగనాథ్

## పన్నెండు స్కంధాల కథ

# భాగవతం

నిగమ కల్పతరో ర్గళితం ఫలం శుకముఖా దమృత ద్రవసమ్మితమ్।
పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువిభావుకాః ।

అది సరస్వతీ నదీతీరం. వ్యాస మునిచంద్రుని పవిత్రాశ్రమం. అక్కడ జైమిని, పైల, సుమంత, వైశంపాయనాది శిష్యులు ధర్మశాస్త్ర మీమాంస చేస్తున్నారు. లోకవృత్త సమీక్ష చేస్తున్నారు. సృష్టి, స్థితి లయాత్మక మయిన ఈ జగత్తు యొక్క లీలా విశేషాలు, పదార్థ పరమార్థ తత్త్వ వివేచ నాలు వారి గోష్ఠిలో సాగిపోతున్నాయి.

వారికి అక్షరభిక్ష పెట్టిన గురుదేవులు ఆచార్య వ్యాసులు మాత్రం అన్యమనస్కంగా ఉన్నారు. ప్రతిరోజు వారి చర్చలలో, వాగ్వాదాలలో పాల్గొని వారి బుద్ధికి అందని తాత్విక రహస్యాలు విశదీకరించే ఆ మహర్షి యీనాడు చింతాక్రాంతులై ఉండడం వారికి ఆశ్చర్య వ్యథ కలిగించింది.

అయినా ఆయన ఏకాంత మౌన మహా సమాధిని భంగ పరచడం యిష్టంలేక శిష్యులు తమ చర్చలో నిమగ్నులయారు.

అంతలో అక్కడకు దేవరుషి నారదుడు వచ్చాడు. వైశంపాయ నాదులు ఆయనకు అర్ఘ్యపాద్యాలు యిచ్చి ఉచితాసనంపై కూర్చుండబెట్టారు.

# భక్తి వేదాంత రసాలం....

పరమ విష్ణు భక్తుడయిన నారదుడు అక్షర తపస్వి కృష్ణద్వైపాయనుడు ఎదురెదురుగా ఉన్నారు. క్షణంసేపు యిరువురిలో మహామౌనం తాండవించింది. ఒకరి నేత్రాలలో జిజ్ఞాస, అవి నారదుని చూపులు. మరొకరి కందోయిలో అసంతృప్తి చేతన. అది వ్యాసుని దృష్టి ప్రసారం. నారదుడే వ్యాసుని విచారానికి కారణం ఏమిటని ప్రశ్నించాడు. అప్పుడు వ్యాసుడు యిలా అన్నాడు:

"దేవర్షీ। సరస్వతీ కటాక్షంచేత రాశీభూతంగా ఉన్న వేదసముచ్చయాన్ని విభాగించి నాలుగు వేదాలుగా లోకానికి అందించగలిగాను. విజ్ఞాన సర్వస్వమయిన మహా భారాతాన్ని రచించి తపస్వులకు నివేదనం చేశాను. శ్రీరామతత్వాన్ని విశ్లేషించి అధ్యాత్మ రామాయణాన్ని వేదాంతులకు జ్ఞానామృతంగా పంచాను. ఈ మహా సృష్టి కాల స్వరూపాన్ని వివరించే పద్దెనిమిది పురాణాలు వెలయించాను. ఇంక వాఙ్మయం సృష్టించినా నాలో తృప్తి కలగలేదు. నాకు శాంతి లభించలేదు. నా సాహిత్య పిపాస తీరలేదు. ఏం చేస్తే నా అక్షర తపోసాధన సార్థకం అవుతుంది?"

వ్యాసుని మాటలు విన్న నారదర్షి మందహాసం చేసి యిలా అన్నాడు.

"కృష్ణద్వైపాయనా! శ్రుతివిహితమయిన రీతిలో సంచరించే ప్రాజ్ఞులకు మాత్రమే వేదం అంది వస్తుంది. అసాధారణ ధీమంతులు మాత్రమే మహాభారాతాన్ని ధారణ చేయగలరు. వేదాంత మనస్కులు మాత్రమే అధ్యాత్మ

రామాయణామృతాన్ని గ్రోలేవలరు. ఇక పురాణాలంటావా అవి అక్షయ విషయ సంభవితాలు. కనుక సామాన్యులు వాటిలో ప్రవేశించలేరు. అంత మాత్రంచేత నీ అక్షర తపస్సు వృధా పోయినదని అర్థంకాదు. ఆ చంద్రతార్కారం. అది సాహితీ పథగాములకు ప్రాతఃస్మరణీయాలే అవుతాయి. కాని సామాన్య జనులు సులభంగా తరించడానికి జ్ఞాన వేదాంత భావాల్ని అవగతం చేసుకొనడానికి ఉపయుక్తమయిన మహాభాగవతాన్ని వ్రాయి. అది భక్తి వేదాంత రసాలమై అందరికీ ఉపకరిస్తుంది. నీకు చిత్తశాంతి లభిస్తుంది."

ఈ విధంగా నారదర్షి వ్యాసునకు హితవు చెప్పి వెళ్ళిపోయాడు. వ్యాసుడు ఒక శుభ ముహూర్తాన భాగవతం రచించాడు. దానిని తన కుమారుడయిన శుకమహర్షి కి వినిపించాడు. శుకుడు కాలాంతరంలో పాండవుల మనుమడయిన పరీక్షిత్తుకు భాగవతాన్ని యేడు రోజులలో వినిపించాడు. పరీక్షిత్తు తరించాడు.

సంస్కృత మహాభాగవతం పన్నెండు స్కంధాలుగా విభాగితం అయింది. మొదటి తొమ్మిది స్కంధాలలో సృష్టివివరం, కాలవివరణ దశావతారాలు వస్తాయి. పదవ స్కంధం కృష్ణలీలా రహస్యాన్ని తేటం తెల్లం చేసుకోండి. పదకొండు, పన్నెండు స్కంధాలలో యదువంశ నాశనం కలియుగ ధర్మాలు యితరాలయిన అనేక విశేషాలు వర్ణితమైనాయి. ఇలా మొత్తం భాగవతం పద్దెనిమిదివేల శ్లోకాలతో విరాజిల్లింది.

మహాభాగవతం ఉపాసకులకు భక్తితత్వ కోశాగారం అంతేకాదు. భక్తి, జ్ఞాన వైరాగ్యాల త్రివేణి సంగమం దీనిలో ఇరవై నాలుగు అవతారాల

కథలున్నాయి. వేదాంత వివరాలున్నాయి. భక్తుల దివ్య చరిత్రలున్నాయి. ఏ స్కంధంలో యేవేవి వస్తాయో సంగ్రహంగా తెలుసుకుందాం.

ప్రథమ (మొదటి) స్కంధంలో యీ ప్రపంచం యొక్క ఉత్పత్తి, ప్రళయస్థానాలు నిర్గుణ పరబ్రహ్మ సాక్షాత్కారానికై చేసే జ్ఞానార్జన భక్తి యోగం వివరించబడినాయి. పరీక్షిత్తు కథ యిందులో వస్తుంది. శుక పరీక్షిత్తుల సంవాదం దీనిలో వర్ణితమైంది.

ద్వితీయ (రెండవ) స్కంథంలో యోగధారణ. ఊర్ధ్వలోక ప్రాప్తి నారదబ్రహ్మ సంవాదం సృష్టిక్రమం వర్ణితమైనాయి.

తృతీయ (మూడవ) సంకంధంలో ప్రళయవేళ పరమాత్మ స్వరూపం, స్థూల, సూక్ష్మ సృష్టుల విస్తరణ, వరహావతారం, జయవిజయుల కథ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వృత్తాతం, కపిల చరిత్ర భక్తియోగం వంటి వివిధ విషయాలున్నాయి.

చతుర్థ (నాలుగవ) స్కథంలో మరీచ్యాది తొమ్మిదిమంది ప్రజా పతుల ఉత్పత్తి, దక్షయజ్ఞ విధ్వంసం ధృవచరిత్ర పృథువు కథ ప్రాచీనబర్హి యితిహాసం వర్ణితమైనాయి.

పంచమ (ఐదవ) స్కంధంలో ప్రియవ్రతోపాఖ్యానం, నాభి, వృషభ భరతుల చరిత్రులు, దీప, వర్ష, సముద్ర, పర్వత, నదీనదుల వర్ణన, జ్యోతిశ్చక్రవివరం, నరక పాతాళాల స్థితి వివరించబడినాయి.

షష్ఠ (ఆరవ) స్కంధంలో దక్షుని ఆవిర్భావం, దక్షపుత్రికల సంతాన వివరణ, వారి వల్ల సృష్టి విస్తరణ, వృత్తా సురోపాఖ్యానం ఉన్నాయి.

సప్తమ (ఏడవ) స్కంధంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కథ, ప్రహ్లాదోపాఖ్యానం వివరించబడినాయి.

అష్టమ (ఎనిమిదవ) స్కంధంలో గజేంద్రమోక్షం, మన్వంతర వర్ణన, మత్స్య కూర్మ,వరాహ, నరసింహ, వామన. హయగ్రీవాది అవతారాలు క్షీరసాగర మథనం ఉన్నాయి.

నవమ (తొమ్మిదవ) స్కంధంలో ఇక్ష్వాకుకథ, సూర్యవంశవివరణ. సగర రామ చరిత్రలు, పరశురాముని కథ, చంద్రవంశరాజుల వర్ణన ఉన్నాయి.

దశమ (పదవ) స్కంధంలో శ్రీ కృష్ణుని బాల్యక్రీడలు, రాస లీలలు, కంసవధ, శ్రీ కష్ణ పరిణయం కృష్ణ విజయాదులు, భూభారహరణం వంటి దివ్యగాథలు రసవత్తరంగా వివరింపబడినాయి.

ఏకాదశ (పదకొండవ) స్కంధంలో యదువంశ నాశనం, కృష్ణ ఉద్ధవసంవాదం, కృష్ణావతార పరిసమాప్తి వర్ణితమైనాయి.

ద్వాదశ (పన్నెండవ) స్కంధంలో యుగలక్షణాలు, కలియుగ, వివర్ణ, నాలుగు రకాల ప్రళయాలు. మూడురకాల సృష్టులు, వేదశాఖల వర్ణన పరీక్షిత్తు దేహత్యాగం, మార్కండేయచరిత్ర. సూర్యవివరణ మొదలయిన ఎన్నో రహస్యవిషయాలు వర్ణితమైనాయి.

ఈ రకంగా భక్తి, జ్ఞాన వైరాగ్య విషయాలను రమణీయంగాచేపించి నది కనుక భాగవతాన్ని మధుర సఫల భరితమయిన రసాలం (మామిడిచెట్టు) అని సాహితీ విదులు శిరసున దాల్చారు.

అటువంటి సంస్కృత భాగవతాన్ని పోతనగారు తేట తెలుగు పద్యాలతో ఆంధ్రజాతికి అందించారు. ఆయన రామాజ్ఞాను సారం యీకావ్యాన్ని వ్రాసి చిరయశస్సు నార్జించారు. భాగవత కథలు ప్రేరణగా దేశంలో ఒకానొక ఘట్టంలో భక్తితత్వం ఉద్యమంగా విస్తరిల్లింది. చైతన్య మహాప్రభువు వంటి వారు భాగవత ధర్మాన్ని అనుష్టించి భక్తితత్వాన్ని ప్రచారం చేశారు. సురదాసు వంటి కవులు అజరామరమయిన కవితల్లో కృష్ణావతారాన్ని అక్షయం చేశారు.

కృష్ణకథలతో సంగీతరూపకాలు వెలిశాయి. నవలలు, నాటకాలు విలసిల్లాయి. విప్రలంభ శృంగారపరమైన పదకవితకు రాధాకృష్ణ ప్రణయ కథ అలంబనం అయింది. భారతదేశంలోని ప్రజలకందరకూ రాముడు, కృష్ణుడు ఆరాధ్యులయ్యారు. రామాయణ, భారత, భాగవతాలు నిత్యపఠనీయాలయాయి. భాగవత కథను యెందరో యెన్నో రూపాలలో నాటికీ, నేటికి వ్రాస్తూనే ఉన్నారు. మా తండ్రిగారు పురాణపండ రామమూర్తిగారు మూలభాగవతానికి వ్యాఖ్యానంతో అచ్చం తెలుగు అనువాదం అందించారు. దశమస్కంధంలో కృష్ణ తత్వంపై ఆయన వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథం తెలుగులో ఆ రీతి గ్రంథాలలో తలమానికమయినది.

ఇంతటి భావవిస్తృతి గల భాగవత మహాగ్రంథం చదవాలనే వారికి యీ చిన్న పుస్తకం చిరుదీపం మాత్రమే. స్థావివులోక న్యాయంగా ఈభాగవతం చదివి పెద్దయినాక వ్యాసర్షి వెలయించిన సంస్కృత భాగవతాన్ని పోతన్న గారు పోతపోసిన అచ్చ తెలుగు పద్య భాగవతాన్ని ఆకళింపు జేసుకొని, ఆపై

భాగవతత్వాన్ని అవగతం చేసుకొంటారన్న ఆశతోనే బాలబాలికలకు ఈ బొమ్మల భాగవతాన్ని అందిస్తున్నాను. ఇక భాగవత మహాసౌధంలో మొదటి స్కంధం వెనజల్లే కాంతులు చూద్దాం.

## పురాణ తిలకం

నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు సత్రయాగం చేశారు. తీరిక వేళల్లో సూతుడు వారికి సకల పురాణాలు వినిపించాడు. వారి కోరికను పురస్కరించుకొని ఆయనే పురాణ తిలకమయిన శ్రీమద్భాగవతాన్ని ప్రవచించాడు.

అధ్యయన, అధ్యాపన సంప్రదాయం భారతీయ వ్యవస్థలో ఒక విశిష్ట పద్ధతి గురువునుంచి విద్యను నేర్చుకొనడం, దానిని మరల శిష్యులకు బోధించడం యీ పద్ధతి భారతీయ ధర్మశాస్త్రాలన్నీ అలా ప్రచురితమైనవే. రామాయణాన్ని శివుడు పార్వతికి చెప్పాడు. ఆ తర్వాత దాన్ని వాల్మీకి కుశలవులకు బోధించి గానం చేయించాడు. మహాభారతాన్ని వ్యాసుడు తన శిష్యులలో ఒకడైన వైశంపాయనుని ద్వారా జనమేజయ మహారాజుకు చెప్పించాడు. దానినే మరల సూతుడు శౌనకాదులకు వినిపించాడు.

అలాగే మహాభాగవతాన్ని వ్యాసమహర్షి తన కుమారుడైన శుకునకు బోధించాడు. శుకమహర్షి ఆ కథను మహాభాగవత శిఖామణి అయిన పరీక్షిత్తునకు వినిపించాడు. ఆక్రమంలోనే సూతుడు శౌనకాదులకు భాగవత పురాణం చెప్పాడు.

# పరీక్షిత్తు

కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవులు పరిపాలన సాగింది. ఆ తర్వాత సామ్రాజ్యాన్ని తమ మనుమడు అభిమన్యుని కుమారుడు అయిన పరీక్షిత్తుకు పట్టం కట్టి పాండవులు మహాప్రస్థానం చేశారు.

మేనమామ అయిన ఉత్తరుని కుమార్తె ఐరావతిని పరీక్షిత్తు వివాహం చేసుకున్నాడు. అశ్వమేధాలు చేశాడు. అతడు ధర్మరాజువలె ప్రజా రంజకంగా ధర్మబద్ధంగా పరిపాలన చేస్తున్నాడు. ఎక్కడా అతివృష్టులు లేవు. అనావృష్టులు లేవు. అకాలమరణాలులేవు. ధర్మోల్లంఘనలులేవు. నాలుగువర్ణాల వారు తమకు విధించిన పనులన్నీ యధావిధిగా చేసుకొని పోతున్నారు. పరీక్షిత్తును ప్రజలందరూ ధర్మప్రభువని వేనోళ్ళ కీర్తిస్తున్నారు.

ఒకనాడాయన వేటకై అరణ్యానికి వెళ్ళాడు. క్రూరమృగాలు ఎన్నింటినో వేటాడాడు. బాగా అలసిపోయాడు. మంచినీటిని అన్వేషిస్తూ ఒక ఆశ్రమానికి వచ్చాడు.

# శృంగి శాపం

అది మహాముని తపస్సంపన్నుడు అయిన శమీకుని ఆశ్రమం పరమ పావనంగా నిలాంత నిశ్శబ్దంగా ఉంది. ఆశ్రమంలో ఎవ్వరూ లేరు.

శమీకుడు మాత్రం దర్భాసనంపై కూర్చుని సమాధిలో ఉన్నాడు. పరీక్షిత్తు ఆశ్రమ ప్రాంతం అంతా నీటికై వెతకి, వెతకి ఆశ్రమంలోకి వచ్చాడు.

అక్కడ నిశ్శబ్దం వాతావరణంలో శమీకుడు తపస్సు చేసుకొంటు న్నాడు. ఆయనకు ఈ బాహ్య ప్రపంచ సంగతులు తెలీవు. ఆ స్థితిని సమాధి



శమీకుని మెడలో పాము

స్థితి అంటారు. నీటికై మహర్షిని అడిగాడు. ఆయనకు వినపడలేదు. అసలు ఆ స్థితిలో యేమీ వినపడదు. పరిపరివిధాలా మహర్షి నుంచి నీటిని పొందాలని

ప్రయత్నించి ఎంతకూ శమీకుడు పలకకపోవడంతో విసుగుచెంది పరీక్షిత్తు ఆ సమీపంలో చచ్చిపడి ఉన్న పామును తెచ్చి ఆయన మెడలోవేసి రాజధానికి వెళ్ళిపోయాడు. ఈ సంగతులు యేమీ శమీకునకు తెలియదు. ఆయన సమాధి లోనే ఉన్నాడు.



శృంగి శాపం

శమీకుని కొడుకు శృంగి. అతడు అడవిలోనికి సమిధలకై వెళ్ళాడు. అవి సంగ్రహించుకొని తిరిగి ఆశ్రమానికి వచ్చాడు. తపస్సమాధిలో నిశ్చలంగా ఉన్న తన తండ్రి మెడలో పాము కళేబరం ఉండడం చూశాడు. కర్రతో ఆ

పామును దూరంగా విసిరివేశాడు. అతడికి ఆగ్రహం కలిగింది. చీమకైనా హాని చేయని తన తండ్రికి పాము కళేబరాన్ని మెడలో వేసి అవమానించిన వారెవరని దివ్యదృష్టితో చూశాడు.

పరీక్షిత్తు రూపం, అతడు దప్పికతో రావడం, తండ్రి మాట్లాడక పోవడం, ఆయన పాము కళేబరాన్ని శమీకుని మెడలోవేసి వెళ్ళిపోవడం శృంగికి కనిపించింది.

తపోధనులైన మహర్షుల్ని కాపాడి గౌరవించవలసినరాజు ఈ నీచానికి పాల్పడ్డాడని ఆగ్రహించి శృంగి యిలా శపించాడు.

"బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు, తపస్వి అహింసామూర్తి అయిన నాతండ్రి మెడలో చచ్చిన పామును వేసిన ఆ అహంకారి ఎవరైనాపరే నేటికి వారం రోజులలో తక్షకుడనే పాము విషానికి గురై మరణించును గాక!!"

శృంగి యిలా శపించి, ఆశ్రమ పనులలో నిమగ్నుడయ్యాడు. ఇంతలో శమీకుడు సమాధి చాలించి లేచాడు. తండ్రికి సేవలుచేసి శృంగి తన శాపం గురించి ఆయనకు చెప్పాడు.

## భాగవత సప్తాహం

శమీకుడు ఎంతో నొచ్చుకున్నాడు. ధర్మపరిపాలకుడయిన పరీక్షిత్తు యేదో ఆవేశంతో చేసిన పొరపాటుకు అతడికి ప్రాణాంతక శాపం విధించడం

శమీకుని యెంతగానో బాధించింది. వెంటనే మునిబాలకుడు ఒకడిని పిలిచి ఈ శాప వృత్తాంతం చెప్పి రావలసినదని పరీక్షిత్తు దగ్గరకు పంపాడు. ఆ బాలకుడు పరీక్షిత్తు దగ్గరకు వెళ్ళి శృంగి పెట్టిన శాపం గురించి చెప్పాడు.



శుకుని భాగవత ప్రవచనం

పరీక్షిత్తు తన తప్పిదానికి యెంతగానో బాధపడ్డాడు. మంత్రి పురోహితుల్ని రావించి తను చేయవలసిన ధర్మరక్షణ కార్యాలు గురించి అడిగారు. అప్పుడు మంత్రులు యిలా అన్నారు:

"మహారాజా! గంగానదీ మధ్యంలో ఒంటి స్తంభం మేడ నిర్మింపచేద్దాం. మీరందులో ఉండండి. తక్షకుడు అక్కడకు రాలేడు."

మంత్రుల అభీష్టానుసారం వెనువెంటనే ఒంటి స్తంభం మేడ నిర్మితమయింది. పరీక్షిత్తు అందులో ఉంటున్నాడు. అప్పుడు పురోహితులు యిలా అన్నారు:

"పరీక్షిన్నరేంద్రా! విప్రుని శాపం వృధాపోదు. అందుకని యీ ఏడు రోజులలో నువ్వు సద్గోష్టి చేయి. శుకమహర్షిని రావించి భాగవతం విను. పుణ్యలోకాలు సిద్ధిస్తాయి. నువ్వు నిర్వర్తించిన ఈ విధి భావితరాలకు "భాగవత సప్తాహంగా అందివస్తుంది."

పురోహితుల హితవచనాలు విని పరీక్షిత్తు భాగవత సప్తాహ పూజా కార్యక్రమం ప్రారంభించాడు. శుకమహర్షి వచ్చాడు. భాగవతాన్ని పరీక్షిత్తునకు వినిపించాడు. ఏడవరోజున తక్షక విషాగ్ని కీలలకు పరీక్షిత్తు పాంచభౌతిక శరీరం విడిచి విష్ణు సాయుజ్యం పొందాడు. ఆ ఏడు రోజులలో శుకుడు చెప్పిన భాగవతాన్ని యిప్పుడు సంగ్రహంగా చెప్పుకుందాం.

## అవతారాలు

పురుషోత్తముడైన శ్రీమన్నారాయణు యెన్నో అవతారాలు యెత్తి లోకాన్ని ఉద్ధరించాడు. ఆదిలో సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులనే

బాలకులుగా అవతరించాడు, వారు బ్రహ్మవేత్తలై లోకానికి మార్గోపదేశం చేశారు. భూదేవిని ఉద్ధరించడానికి వరహావతారం ఎత్తాడు. పాంచ రాత్రూనయ ప్రచారానికై నారద రూపం ధరించాడు. నరనారాయణ రూపాలు ధరించాడు. కపిలుడై సాంఖ్యయోగాన్ని వివరించాడు. దత్తాత్రేయుడయినాడు. యజ్ఞుడై పుట్టి స్వాయంభువ మన్వంతరాన్ని రక్షించాడు. ఋషభుడుగా అవతరించాడు. పృధు చక్రవర్తిగా ప్రభవించి భూమిని కాపాడాడు. మత్స్యావతారం ధరించాడు. కూర్మరూపుడయాడు. జగన్మోహిని అయాడు. నృశింహావతారంలో హిరణ్య కశిపుణ్ణి సంహరించాడు. వామనుడయ్యాడు. పరశురాముడయి భూమిని జయిం చాడు. రాముడుగా అవతరించి ధర్మాన్ని రక్షించాడు. వ్యాసునిగా పుట్టి పురాణాతి హాసాలందించాడు. కృష్ణావతారుడై లీలలెన్నో ప్రదర్శించాడు. బుద్ధవతారంలో దేవద్వేషుల్ని వంచించాడు. కలియుగాంతంలో "కల్కి"గా పుట్టి లోకాన్ని ఉద్ధ రిస్తాడు. శ్రీహరి అవతారాలను అంశావతారాలను, కళావతారాలనీ అంటారు. అయితే కృష్ణావతరం మాత్రం పూర్ణావతారం. ఆ కథ ముందు ముందు తెలుసు కొందాం

## విశ్వ విరాట్

శ్రీమహావిష్ణువే విశ్వ విరాట్రూపంలో విలసిల్లుతున్నాడు. నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, ఈ రూపానికి ఆవరణలు. ఆ పురుషునికి పాతాళంపాదాలు.

రసాతలం పార్ష్ణిభాగం. గుల్ఫాలురెండూ మహాతలంతొడలు తలతలజానుభాగం సుతలం. అతల వితలాలు ఊరుభాగాలు. భూమి పొత్తి కడుపు. ఆకాశం బొడ్డు. స్వర్గలోకం వక్షస్థలం. మహర్లోకం కంఠసీమ, జనోలోకం ముఖం. తపోలోకం



ప్రళయవేళ శ్రీ మహావిష్ణువు

లలాటం. వేయి ముఖాలుగల భగవంతుని శిరస్సే సత్యలోకం. దేవతలు భుజాలు. దిక్కులు చెవులు. అశ్వనీ కుమారులు ముక్కు. గంధం ఘ్రాణేం ద్రియం అగ్నిహోత్రుడే ముఖం. ద్యులోకం కళ్ళు. సూర్యుడే దృష్టిశక్తి.

రాత్రింబవళ్ళు కనురెప్పలు, జలం తాలుభాగం, రసం నాలుక, వేదాలు బ్రహ్మ రంధ్రం, యముడు కోరలు, స్నేహకళలు పలువరుస, మహామాయ ఆయన చిరునవ్వు, ధర్మం స్తనభాగం, అధర్మం వెనుకభాగం, సముద్రం కుక్షి, పర్వతాలు అస్థులు, నదులు నాడీసంముహం, వృక్షాలు రోమాలు, మహావాయువు శ్వాస, కాలం గమనం. మేఘాలు కేశాలు,సంధ్య వస్త్రం, అవ్యక్తం హృదయం రుద్రుడు అహంకారం. మనుష్యులే విరాట్పురుషుని నివాసస్థానం, దేవగణాలు షడ్జమాదిస్వరాం స్మృతి, రాక్షసులు పరమపురుషుని వీర్యం, ఇది విశ్వవిరాట్పురుషుని వర్ణన, అంటే ఈ ప్రకృతి అంతా అతడే అని అర్థం.

# సృష్టి - వికాసం

విశ్వశక్తి రూపుడయిన శ్రీహరి సంకల్పం కారణంగా ఈ సృష్టి జరిగింది. అది వేయి విధాలుగా వికసించి, విస్తరించింది. ఈ క్రియాకలాపాన్ని వివరించేదే వైశ్వీక దర్శనం.

ప్రకృతిలో మూడుశక్తులున్నాయి. అవి 1. జ్ఞానశక్తి 2. క్రియా శక్తి 3. ద్రవ్యశక్తి ఈ మూడు శక్తుల సమ్మేళనాల రూపమే సృష్టి అంతా అని పెద్దలు అంటారు. ఆదికాలంలో మొట్టమెదట ఆకాశం జన్మించింది. దాని గుణం శబ్దం. ఆకాశంలో జన్మించిన కల్లోలం వల్ల వాయువు పుట్టింది. దాని గుణం శబ్దం, స్పర్శ కూడాను. వాయువునుంచి అగ్ని పుట్టింది. దీనికి శబ్ద స్పర్శ గుణాలతో బాటు రూపం అనే విశిష్ట గుణం వచ్చింది. దానినుంచి నీరు పుట్టింది. దీనికి శబ్ద, స్పర్శ, రూపాలతో బాటు 'రసం' అనే గుణం వచ్చింది.

జల వికారం కారణంగా భూమి జన్మించింది. దీనికి శబ్ద, స్పర్శ రూపం, రస గుణాలతోబాటు 'గంధం' అనే గుణం కూడా వచ్చింది. ఈ రకంగా ఆకాశం, వాయువు, అగ్ని, నీరు. భూమి యీ ఐదు భూతాలు ఏర్పడి వీటినుంచే మిగిలిన సృష్టి కొనసాగింది.



సృష్టి వికాసం

అయితే యిందుకు కోట్ల సంవత్సరాలు పట్టింది. మొట్టమొదట యీ యీ బ్రహ్మాండం నిర్జీవంగా ఉంది. అప్పుడు శ్రీ హరి దానితో జీవశక్తిని ప్రసరించాడు. దానితో ఆ బ్రహ్మాండం నుంచి సమస్త సృష్టి జరిగింది. ఆదే

విరాట్పురుషుని సృష్టి క్రమం. ఆ పురుషుని యందు ఈ విశ్వమంతా దేనికి "దశాంఖుళన్యాయం" అని వేదాంతశాస్త్రం చెబుతోంది. అంటే భూమి కంటె పదిరెట్లు జలం, జలం కంటే పదింతలు అగ్ని అగ్ని కంటె పదింతలు వాయువు, వాయువు కన్నా పదింతలు ఆకాశం ఉన్నాయని దీని అర్థం.

## పదిరకాల సృష్టులు

ఎంతో విస్తృత గుణం కల ఈ సృష్టిని పదిరకాలుగా విభాగించారు. అవి 1. మహత్తత్వం: ఇది సృష్ట్యాదినాటి నిశ్శబ్ద స్థితి. 2. అహంకారం: ఈ దశలోనే దశేంద్రియాలకు బీజవాపం జరిగింది. 3. భూతస్వర్గం: ఈ స్థితి లోనే పంచభూతాలకు ఆలంబనమైన తన్మాత్ర లుంటాయి. 4. ఇంద్రియసృష్టి: ఈస్థితిలోనే జ్ఞాన, క్రియాది గుణాలు ఆవిర్భవిస్తాయి. 5. అధిష్టానసృష్టి: ఇంద్రియాలు, మనసు, ఏర్పడే దశ. 6. అవిద్రాసృష్టి: ఇది మోహ, మహామోహాలు ఆశ్రయించేస్థితి. 7. స్థావరసృష్టి: ఇది వృక్షాల సృష్టికాలం. 8. పశుసృష్టి: ఇది వివిధరకాల పశువులు, పక్షులు సృష్టించబడిన దశ. 9. మనుష్యసృష్టి: మానవజాతి అవిర్భవించిన ఘట్టం ఇది. 10. దైవికసృష్టి: ఇది మరల మొదటి మహత్తత్వదశ వంటిదే కాని మానవులు విశేషశక్తులు కలిగి ఉంటారు.

ఈరకంగా సృష్టి జీవపరిణామాన్ని మహాభాగవతం సవివరంగా స్పష్టం చేసింది.

ఇక్కడ ఆధునిక జీవపరిణామక్రమాన్ని కూడ ఒకసారి మననం చేసుకొంటే భాగవతం సృష్టి. వికాసం గురించి చేసిన వివరణ యెంత హేతు బద్ధమో అర్థం అవుతుంది.

కోట్లసంవత్సరాలక్రితం ఈ సృష్టిలో శూన్యం తప్ప యేమీ లేదు. తర్వాత ఆదిమేఘం (నెబులా) ఆవిర్భవించింది. గ్రహాలు రకాలు వచ్చాయి. సూర్యకుటుంబం అవతరించింది. సముద్రాలు ఉద్భవించాయి. భూమి ఎర్పడింది. ఏకకణజీవి వచ్చింది. బహుకణ జీవులు పుట్టాయి. సముద్ర జంతువులు, ఉభయచరాలు, అకాశచరాలు, భూచరాలు, మానవులు వచ్చారు. ఇది ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్న సిద్ధాంతం. భాగవతం పేర్కొన్న "బ్రహ్మాండం" అనే శబ్దం "ఆదిమేఘాని" కి సరిపోగలదు! మొత్తంమీద భారతీయులు అతిప్రాచీన కాలంలోనే సృష్టి జీవనపరిణామం గురించి ఒక అవగాహన చేశారనడానికి యీ భాగవత వర్ణనము ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.

## కాల గణన ....

"కనిపించే వస్తుప్రపంచంలో కనిపించకుండా కదిలిపోయేది కాలం ఒక్కటే. అందుకే సంఘటనల రూపాంతరం కాలం అన్నారు విడిగా అది నిర్విశేషం. అది అనంతం అందుకే కాలాన్ని భగవత్స్వరూపంగా, భగవం

తుణ్ని కాలస్వరూపుడుగా వర్ణించారు. అయితే మరికాలాన్ని ఎలా కొలుస్తారు? ఈప్రశ్నకు సమాధానంగా భాగవతం యిలా చెపుతోంది.

రెండు "పరమాణువులు" ఒక "అణువు" మూడు అణువులు "త్రసరేణువు" కిటికీ ద్వారా సూర్యకిరణం ప్రసరిస్తునప్పుడు కంటికి కనిపించవే త్రసరేణువులు. ఇటువంటి మూడు "త్రసరేణువు"ల్ని దాటడానికి సూర్య కిరణానికి పట్టేకాలం ఒక "త్రుటి" నూరుత్రుటులు ఒక "వేధ" మూడు వేధలు ఒక "లవం" మూడులవలు ఒక "నిమిషం" మూడునిమిషాలు ఒక "క్షణం" ఐదు క్షణాలు "కాష్ఠ" పదిహేను కాష్ఠలు ఒక "లఘువు" పదిహేను లఘువులు ఒక "నాడి" రెండునాడులు ఒక "ముహూర్తం" ఆరు లేక యేడు నాడులు ఒక "ప్రహరం" దీనినే "యామం" అంటారు. అంటే మనుషుల పగలు లేక రాత్రికాలంలో యిది నాలుగవ భాగం. ఇటువంటి ఎనిమిది'యామా' లు ఒకరోజు ముప్పైరోజులు నెల. ఆరునెలలు ఒక ఆయనం. రెండు ఆయనాలు ఒక సంవత్సరం. నూరేళ్ళు మానవాయుర్దాయం. కాలస్వరూపుడైన సూర్యుడు పరమాణువు మొదలు సంవత్సరం వరకు పన్నెండు రాశులు గల భువనంలో ప్రదక్షిణ చేస్తుంటాడు.

ఈ కాలప్రమాణాన్ని హెచ్చవేస్తూపోతే యుగాలు వస్తాయి. యుగాలు నాలుగు. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం. కృతయుగం పదిహేడు లక్షల 28వేల సంవత్సరాలు త్రేతాయుగం 12లక్ష 96వేల సంవత్సరాలు. ద్వాపరయుగం 8లక్షల 64వేల సంవత్సరాలు. కలియుగం 4లక్షల 32వేల సంవత్సరాలు. నాలుగుయుగాల కాలాన్ని మహాయుగం అంటారు

ఇటువంటి 71మహాయుగాలు అయితే ఇక మనువు కాలం అవుతుంది. అంటే 306720000 సంవత్సరాలకాలం ఇదే మన్వంతరం. ఇప్పటికి ఆరుగురు మనువులయారు. ఇప్పుడు పదవ మనువు కాలం నడుస్తోంది. వేయి మహా యుగాలయితే బ్రహ్మకు ఒక పగలు. మరో వేయి మహాయుగాలు గడిస్తే అయనకు రాత్రి. ఇది ఒక కల్పం. కల్పానికి పధ్నాలుగుమంది మనువు లుంటారు. బ్రహ్మ ఆయుర్దాయంతో సగభాగాన్ని పరార్ధం అంటారు. ఇప్పటి ఒక పరార్థం నడిచింది. రెండవ పరార్ధం నడుస్తోంది. మొదటి పరార్ధంలో ఆది బ్రహ్మకల్పం, పద్మకల్పం నడిచాయి. బ్రహ్మ ఆవిర్భవించిన కల్పం ఆది బ్రహ్మకల్పం అది శబ్దబ్రహ్మరూపం, పద్మకల్పంలో బ్రహ్మ విష్ణువు నాభి నుంచి జన్మించిన తామరపూవు నుంచి ఉద్భవించాడు. అందుకే పద్మకల్పం అయింది అది.

ఇప్పుడు నడుస్తున్న రెండవ పరార్థపు మొదటి కల్పాన్ని శ్వేత వరాహ కల్పం అంటారు. ఈ కల్పం లోనే శ్రీహరి వరాహావతారం యెత్తాడు. అందుకే దీనికి పేరు వచ్చింది. పరమాణువు నుంచి ద్వితీయపరార్ధం వరకు విస్త రించి వచ్చిన కాలం పరమేశ్వరుడైన శ్రీ మహా విష్ణువు పై యెటువంటి ప్రభా వాన్ని ప్రసరించదు, అట్టి శ్రీహరి లీలలు తెలుసుకొందాం.



# వరాహమూర్తి

సృష్టి విస్తరించింది. మన్వాంతరాలు గడిచాయి. మొదటి పరార్థం పూర్తి అయింది. బ్రహ్మగారి ఆయుర్దాయంలో ద్వితీయ పరార్థం ప్రారంభం



వరాహవతారం

అయింది. అప్పటికి సృష్టి చేయగల సర్వ శక్తులతో బ్రహ్మ మాత్రం ఉన్నాడు. సృష్టి ఎలా చేయాలో" అని ఆయన ఆలోచిస్తునాడు. బ్రహ్మకు 'క' అని వేద వాఙ్మయంలో పేరుంది. ఆ ఆలోచనలలో ఉండగానే ఆయన శరీరం రెండు

భాగాలైంది. అందుకే దానిని 'కాయ' అన్నారు ఒక భాగం పురుషుడు. రెండవ భాగం స్త్రీ ఆ పురుషుడే స్వాయంభువు. ఆ స్త్రీ యే శాతృప. వారిద్దరే ఈ సృష్టిలో దాంపత్య జీవితానికి అంకురార్పణ చేసారు. వారి సాంసారిక జీవిత ఫలంగా ప్రియ వ్రతుడు. ఉత్తానపాదుడు అనే కొడుకులు, ఆకూతి. దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు జన్మించారు. వీరి సంతానం కాల క్రమంలో ప్రపంచం అంతా విస్తరించింది.

అప్పటికి భూమి మహా సముద్రంలో మునిగి ఉంది. స్వయంభువు యొక్క సంతానానికి వారి సంతతికి అంటే యీ మనుష్యజాతికి నివసించే చోటు కనిపించ లేదు.

అప్పుడు స్వయంభువు బ్రహ్మనిలా ప్రార్ధించాడు:

"తండ్రీ నీ సంకల్పం చేత ఈ సృష్టిలో స్త్రీ పురుష లింగ భేదంతో జీవులు మానవులు అవతరిస్తున్నారు. వారు నివసించడానికి యోగ్యమైన భూమి సముద్రంలో మునిగి పోయి ఉంది. దానిని ఉద్ధరించి పైకి తీసి లోకోపకారం చెయ్యి ఆపై ప్రజా పాలనం, మనుష్య విస్తార కార్యాలను నీ ఆనతిన నేను నెర వేరుస్తాను."

స్వయంభువు మాటలు విన్న బ్రహ్మ చుట్టూ కలయ జూసాడు. అంతా మహా సముద్రం. గ్రహ నక్షత్రాలు మాత్రం ఆకాశాలు శుక్ర మార్గాన పరి భ్రమిస్తున్నాయి. మానవ సంతతి జీవులు నివసించ డానికి యోగ్యమైన స్థలం లేదు భూమి సముద్రంలో మునిగి పోయి ఉంది. దానిని పైకి తీయాలంటే ఏమి చేయాలి అని దీర్ఘంగా ఆలోచిస్తున్న బ్రహ్మ ముక్కు నుంచి అంగుష్ఠ

ప్రమాణం గల ఒక వరాహం జన్మించింది. అది నిమేష కాలంలోనే ఐరావత గజం వలె పెరిగి పోయింది. అందరూ ఆ వరాహ మూర్తిని చూసి ఆశ్చర్య పడ్డారు. అది శ్రీహరి అవతారం అనిగుర్తించారు. వేద ఋక్కులతో ఆ స్వామిని స్తుతించారు.

వరాహస్వామి ఎంతో వేగంతో ఆకాశంలో గంతులు వేశాడు. ఆయన శరీరం ధృడంగా ఉంది, ఒంటి రోమాలు శూలాల్లా ఉన్నాయి. తెల్లని కోరలు ప్రకాశిస్తున్నాయి కళ్ళు సూర్య చంద్రుల వలె కాంతులీను తున్నాయి.

ఆయన ప్రళయ సముద్రంలో మునిగాడు. వరాహానికి వాసనను బట్టి వస్తువును గుర్తించే విచిత్ర శక్తి ఉంది. భూమి గంధవతి అందుకే శ్రీహరి వరాహావతారం ఎత్తాడు. సముద్రంలో భూమి ఉనికిని గుర్తించడానికై వాసన చూస్తు కలియ తిరుగు తున్నాడు. కోరలతో సముద్ర గర్భాన్ని కలచి వేస్తున్నాడు, తోకతో సాగర జలాలను చిలుకు తున్నాడు వేగంగా ఈది సముద్ర జలాన్ని అతలా కుతలం చేస్తున్నాడు.

అలా వెతికి సముద్రం క్రింద రసా తలంలో మునిగి ఉన్న భూమిని చూశాడు. బంతి వలె పట్టు కొన్నాడు. వాడి తేలిన కోరలపై నిలిపాడు ప్రచండ వేగంతో సముద్రం నుంచి పైకి వస్తుంటే హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు అడ్డగించాడు, వాడు అక్కడ రాజు. భూమిని ఎవ్వరు తీసుకు పోవడం వాడికి యిష్టంలేదు.

అందుకే వరాహమూర్తిపై విరుచుకొని పడ్డాడు, యజ్ఞవరాహమూర్తి గద ధరించాడు. హిరణ్యాక్షుడు కూడా గదను తీసు కొన్నాడు. ఇద్దరూ భయంక

రంగా పోరాడారు. గధలు ముక్క ముక్కలైనాయి. వరాహస్వామి కోరలపై చంద్ర బింబం వలె భాసిస్తున్న భూమిని అందుకోవాలని హిరణ్యాక్షుడు ప్రయత్నించాడు. అప్పుడు ఆ స్వామి హిరణ్యాక్షుని అతిలాఘవంగా చేతి గోళ్ళతో, చర్మం మీది వజ్రాల వంటి రోమాలతో గుచ్చి చంపాడు.

హిరణ్యాక్షుడు హాహాకారం చేస్తూ ప్రాణాలు విడిచాడు. అతడి శరీరం నుంచి ప్రాణ జ్యోతి వెలువడి వరాహస్వామిలో ఐక్యం అయింది. హిరణ్యాక్షుని వధించి. భూమిని సముద్రం పైకి తెచ్చాడు వరాహస్వామి అప్పుడు దేవతలు, ప్రజాపతులు, మహర్షులు ఆయనను ప్రార్థించి ఇలా అన్నారు.

"యజ్ఞ పురుషా! వరాహ స్వామీ! నీకిదే వందనం. ఈ భూమిని సముద్రంపై తేలి ఉండే టట్లు ప్రతిష్ఠించు. సముద్రం చెలియలికట్టదాటి రాకుండ శాసించు ఆ రకంగా భూమి సకల చరా చర జీవరాశికి నివాస యోగ్యం అయింది.

వారందరి ప్రార్థన విని యజ్ఞ వరాహమూర్తి భూమిని సముద్రంపై నిలిపాడు. చెలియలకట్ట దాటిరావద్దని సముద్రుణ్ని శాసించాడు.అందరిని దీవించి అంతర్ధానం అయాడు.

యజ్ఞ వరాహస్వామి పరాక్రమ గాధను కిన్నెర, కింపురుషాదులు గానం చేశారు. భూ మాత పులకరించింది. సకల జీవ రాశిని తనపై విలసిల్ల మని హ దేవి ఆదరంగా లాలించింది. అలా ఆదిమ కాలంలో శ్రీహరి వరాహమూర్తియై భూమిని ఉద్ధరించాడు. సృష్టికి నవజీవనం ప్రసాదించాడు. ఈ గాధ సకల శుభప్రదం అని భాగవత విదులు అంటారు.

# జయ విజయులు

కల్పాంతరాల నాటి సంగతి. వైకుంఠంలో శ్రీ మహా విష్ణువు, శ్రీ లక్షితో ఏకాంతంలో ఉన్నాడు. వారి ఆ ప్రణయ ఏకాంతం సృష్టిలీలలలో ఒక చిద్విలాసం వైకుంఠ సింహ ద్వారం దగ్గర జయ విజయులు కావలి కాస్తు న్నారు. వారు విష్ణుమూర్తికి ప్రీతి పాత్రులు. వారికి శ్రీహరి అంటే ప్రాణం ఆయన సన్నిధిని విడిచి ఉంకలేరు వారు.

లక్ష్మీ నారాయణుల ఏకాంతాన్ని ఎవరు భంగ పరచ కుండా వారు అప్రమత్తులై కావలి కాస్తున్నారు. ఇంతలో శ్రీహరిని దర్శించాలని సనక సనంద నాదులు వచ్చారు. జయ విజయులు అడ్డు పెట్టారు. బాల రుషులు ఎంత చెప్పినా జయ విజయులు వినలేదు, వారికి దారి యివ్వలేదు దానితో ఆగ్రహించిన వారు జయ విజయుల్ని శపించారు.

"మీరు శ్రీహరికి దూరమై పోతారు."- అని సనక సనందనులు వెళ్ళిపోయారు.

తర్వాత శ్రీహరికి జయ విజయులు మొర పెట్టు కొన్నారు. అప్పుడు లీలా మానుషరూపుడైన శ్రీహరి యిలా అన్నాడు:

"జయవిజయులారా! మునులశాపం వమ్ముకాదు. పైగా అది లోకోపకారం. స్నేహభావంతో ఆరు జన్మలలో మీరు నన్ను చేరతారు. విష్ణు వైరాన్ని అవలంభించి మూడుజన్మలలో నా సామ్రాజ్యం పొందుతారు."

శ్రీహరి మాటలు విన్న జయవిజయులు ఇలా అన్నారు.

"మహాపురుషా! ఆరుజన్మలకాలం నీకు దూరంగా మేం ఉండలేం. కనుక నీతో శత్రుత్వం వహించి మూడు జన్మలలోనే నీ దగ్గరకు వచ్చేస్తాము."



జయ విజయులకు శాపం

అప్పుడు విష్ణుమూర్తి అలాగే కానిండు. సమయం వచ్చినప్పుడు మీకు ఆదేశిస్తాను. రాక్షసులుగా జన్మిస్తుందురుగాని" అని ఆదేశించాడు. జయ విజయులు ఊరట చెందారు.

# నూరేళ్ళ గర్భం

దక్షుడు తన కన్యలలో పదమూడు మందిని కశ్యపునకు యిచ్చి వివాహం చేశాడు. వారిలో ఒకామె పేరు దితి. ఆమెకు పిల్లలు లేరు. మిగిలిన వారందరికీ సంతానం కలిగింది. ఆలోటు దితిని విపరీతంగా వేధించింది. ఒకనాడు అసురసంధ్యవేళ కశ్యపుడు యజ్ఞదీక్షలో ఉన్నాడు. ఆ సమయంలో దితి కామపరవశ అయింది ఆమె భర్తను చేరి తనకు పుత్రభిక్ష పెట్టమంది. సంధ్యవేళ దాంపత్యం పనికిరాదని కశ్యపుడు చెప్పాడు. అయినా ఆమె వినలేదు. కశ్యపుడు ఆమెకు దాంపత్య సుఖం ప్రసాదించాడు. ఆమె గర్భవతి అయింది. అసురసంధ్యవేళ, దేవనియమానికి వ్యతిరేకంగా సంచరించి గర్భం ధరించిన ఆమెకు దుష్టులైన రాక్షసులు ఇద్దరు జన్మిస్తారని కశ్యపుడు శపించాడు.

అప్పుడు తన తపశ్శక్తిచేత నూరునాళ్ళు గర్భం మోసింది. ఆ సమయంలో ఆమె తన శిశువులకు సకలశక్తులు సమకూర్చాలని ప్రయత్నించింది. ఆమె సంకల్పం ఫలించి సూర్యచంద్రాదుల శక్తి, అష్టదిక్పాలుర తేజస్సు, ఇంద్రాదుల బలపరాక్రమాలు గర్భస్థశిశువులలో చేరాయి. ఆయా దేవతల తేజస్సు క్షీణించసాగింది.

ఈ పరిస్థితి చూసి ఋషులు, దేవతలు శివమహావిష్ణువును ప్రార్థించారు. ఆయన అభయం ఇచ్చి పంపాడు. జయవిజయుల్ని ఆదేశించాడు. వారు దితి గర్భంలో ప్రవేశించారు.

నూరుసంవత్సరాలు అయిన తర్వాత దితి కవలల్ని ప్రసవించింది. వారే హిరణ్యకసిప, హిరణ్యాక్షులు. వారు పుట్టినవేళ సముద్రం ఘోషించింది. దిక్కులు రంగులు మారాయి. ఉల్కలు పడ్డాయి. గాడిదలు వోండ్ర పెట్టాయి. అన్నీ దుశ్శకునాలే కనిపించాయి. అప్పుడు దితి భర్తను తన పుత్రులకు ఉత్తమ గతి ప్రాప్తించే టట్లు అనుగ్రహించ మని ప్రార్థించింది. దానికి కశ్యపుడు యిలా అన్నాడు.

"వీరు బ్రాహ్మణ, యజ్ఞ కర్మ ద్వేషులై ప్రవర్తిస్తారు. చివరకు శ్రీ మహావిష్ణువు చేత సంహరించ బడి వైకుంఠం చేరుతారు."

కశ్యపుని మాటలు దితికి ఊరట కలిగించాయి. హిరణ్యకశ్యపుడు, హిరణ్యాక్షులు పెరిగి పెద్ద వారైనారు. లోక కంటకులయారు హిరణ్యాక్షుడు భూమిని అపహరించ బోయి వరాహమూర్తిచేత చంపబడ్డాడు. ఇక హిరణ్యకశిపు డున్నాడు. ఆ కథ తర్వాత చెప్పుకొందాం. జయ విజయులు ఒక జన్మలో విష్ణ ద్వేషులైన వైకుంఠం చేరారు. మరొక జన్మలో రావణ కుంభ కర్ణులయారు. మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రి లయారు. రావణ కుంభ కర్ణుల్ని విష్ణ మూర్తి శ్రీ రామావతారం యెత్తి సంహరించాడు. కృష్ణావతారంలో శిశుపాల, దంతవక్త్రుల్ని చంపాడు. ఇలా మూడు జన్మలలో జయ,విజయులు శాపవిముక్తి పొంది, విష్ణ సాయుద్యం పొందారు.

# కపిలుడు

స్వాయంభువ మనువు కుమారులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు. వీరు ఈ భూ మండలాన్ని యేలిన ఉత్తమ చక్రవర్తులు మనువు కుమార్తె దేవహూతి. ఆమె సకల సద్గుణరాశి ఆమెను ఆయన మహావిభవశాలి అయిన కర్దమునకు యిచ్చి వివాహం చేశాడు.

కర్దముడు మహావిష్ణు భక్తుడు. బ్రహ్మ ఆదేశం మేరకు కర్దముడు సరస్వతీనదీ తీరంలో పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. విష్ణు సాక్షాత్కారం పొందాడు. అతడి వంటి కుమారుడు కావాలని వరం కోరాడు. అప్పుడు విష్ణుమూర్తి యిలా అన్నాడు:

"కర్దమా! శతరూపా స్వాయంభువులకుమార్తె దేవహూతి నీకు భార్య అవుతుంది. ఆమె యందు తొమ్మిదిమంది కన్యలు నీకు కలుగుతారు. వారు మరీచ్యాది ఋషుల్ని పరిణయమాడి నీ వంశాన్ని వృద్ధి పరుస్తారు. నేను నీ ద్వారా దేవహూతి యందు జన్మించి లోక కళ్యాణం చేకూరుస్తాను."

అనంతరం కొన్నాళ్ళకు కర్దమునకు దేవహూతితో వివాహం జరిగింది. అక్కడ నుంచి వారుభయులు బ్రహ్మావర్త దేశం వెళ్ళిపోయారు. దానికి రాజధాని బర్హిష్మతీనగరం. ఆదివరహాస్వామి భూమిని ఉద్ధరించి, శరీరం దులుపుకొనగా రాలిన రోమాలు పడి అక్కడ దర్భలు మొలిచాయి. ఋషులు ఆ దర్భలతో యజ్ఞాలు చేసి రాజ్యాన్ని నిర్మించిన ప్రదేశం కనుక అది బర్హిష్మతీ నగరం అని పేరొందింది. కర్దముడు ప్రజారంజకంగా ప

చేస్తున్నాడు. అంతేకాక దేవహూతి కోరికను మన్నించి సర్వఋతువులలోనూ సర్వసుఖాలు యివ్వగల విమానం ఒకదానిని కర్దముడు సృష్టించాడు.

దానితో వుంటూ వారిద్దరు ఆనందంగా కాలం గడుపుతున్నారు. అయినా దేవహూతికి తృప్తి కలగలేదు. అప్పుడు సరస్వతీ నదీతీరానగల బిందు సరోవరంలో స్నానం చేయమన్నాడు. ఆమె అలా చేసింది. మరుక్షణంలో సకలభోగాలు సమకుర్చగల దివ్యభవనం వచ్చింది. కర్దముని యోగశక్తికి దేవహూతి ఆశ్చర్య పడింది. తర్వాత వారిరువురు భూమండలం అంతా విహరించారు. ఆమెకు ఒకే ప్రసవంలో తొమ్మిదిమంది ఆడపిల్లలు పుట్టారు. కర్దముడు సన్యాసం స్వీకరిస్తానన్నాడు. అప్పుడు దేవహూతి పుత్రసంతానం కావాలంది. వారి ప్రణయం ఫలితంగా శ్రీహరి బాలకుడై జన్మించాడు అతడే కపిలుడు. సాంఖ్యదర్శనాన్ని రచించి లోకానికి వుపకారం చేశాడు.

ఆ తర్వాత కర్దముడు తన ఆడపిల్లలలో 'కళా' అనే కుమార్తెను 'మరీచి'కి, 'అనసూయ'ను 'అత్రి'కి 'శ్రద్ధ'ను 'అంగీరసు'నకు 'హవిర్భూ'ని 'పులస్త్యునకు, 'గతి'ని 'పులహో'న'కు 'క్రియ'ను 'క్రతువు'నకు 'ఖ్యాతిని 'భృగు'నకు, 'అరుంధతి'ని 'వశిష్ఠు'నకు 'శాంతి'ని 'అధర్వు'నకు యిచ్చి పెళ్ళిళ్ళు చేశాడు. వారు వారు తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. కర్దముడు కూడ తపస్సుకు వెళ్ళిపోయాడు.

కపిలుడు తల్లి దేవహూతికి చెప్పిన యోగశాస్త్ర విషయాలు, సాంఖ్యదర్శన విశేషాలు తత్వశాస్త్రంలో ఎంతో పేరొందాయి. ఈ రకంగా శ్రీహరి కపిలుడై అవతరించి 'సాంఖ్యదర్శనం' అనుగ్రహించాడు.

# హిరణ్యకశిపుడు

ఇంతవరకు మూడుస్కంధాలకథ సంక్షిప్తంగా చెప్పుకొన్నాం.

నాలుగవ స్కంధంలో మరీచి మొదలైన తొమ్మిదిమంది ప్రజాపతుల వివరం, దక్షయజ్ఞవిధ్వంసం, పృథు చరిత్ర, ప్రాచీనబర్హి కథ వర్ణితమైనవి. ధృవుడి కథ కూడా ఈ స్కంధంలోనే ఉంది.

అలాగే ఐదవ స్కంధంలో ప్రియవ్రతునికథ, నాభి, వృషభ, భరతుల చరిత్ర, ద్వీప, వర్ష సముద్ర, పర్వతాదుల వివరణ, 'జ్యోతిశ్చక్రం వర్ణన మొదలైనవి ఉన్నాయి.

ఆరవస్కంధంలో దక్షుని జననం, పశు పక్ష్యాది మానవ సృష్టి. మొదలైన వివరాలున్నాయి.

ఏడవస్కంధంలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల చరిత్ర, ప్రహ్లాదో పాఖ్యానం ఉన్నాయి.

ఇప్పుడు హిరణ్యకశిపుని కథ తెలుసుకొందాం.

హిరణ్యాక్షుణ్ని శ్రీహరి వరహావతారం యెత్తి చంపాడు. అప్పటి నుంచి అతని సోదరుడైన హిరణ్యకశిపుడు విష్ణుమూర్తిపై పగ పట్టాడు. విష్ణువును జయించి, పరాభవించాలని నిశ్చయించుకొన్నాడు. అది అంత సులభమైన పనికాదు. కనుక బ్రహ్మ గురించి తపస్సు చేసి దివ్యమైన శక్తినిచ్చే వరాలు పొందాలని భావించి, మందర పర్వత గుహలో ప్రవేశించి, తపస్సు ప్రారంభించాడు.

# బ్రహ్మవరాలు

హిరణ్యకశిపుడు ముఖం పైకెత్తి చేతులు ఆకాశంలోకి సారించి, ఏకనిష్ఠతో తపస్సు చేస్తున్నాడు. అతడి మహోగ్ర తపస్సుకు భూమి కంపించింది. సముద్రాలు ఊగాయి. చుక్కలు చెదిరిపోయాయి. లంబికా యోగసాధన చేసిన అతడి శరీరం నుంచి వెలువడుతున్న వేడికి అక్కడి మొక్కలు కమిలిపోయాయి. చుట్టూ పుట్టలు పెరిగాయి, చర్మాన్ని పురుగులు ఆశ్రయించాయి మాంసాన్ని రక్తాన్ని కీటకాలు పీల్చి వేశాయి. అయినా లెక్కచేయక నూరు సంవత్సరాలు హిరణ్యకశిపుడు తపస్సు కొనసాగించాడు. అతడి దీక్షకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అప్పుడు హిరణ్యకశిపుడు యిలా వరం కోరాడు

"గాలిలోకాని, భూమిపైకాని, అగ్నిలోకాని, ఆకాశంలోకాని, రాత్రి కాని, పగలుకాని, మరణం రారాదు. అలాగే మనుషులవల్లకాని, జంతువుల వల్లకాని, నాకు మృత్యువు సంభవించరాదు. అస్త్ర, శస్త్రాలలో దేనివల్లా నాకు చావు సంప్రాప్తించకూడదు."

ఇంతవరకూ యెవ్వరూ కోరని విచిత్రవరాన్ని హిరణ్యకశిపుడు కోరాడు. బ్రహ్మ ఆ వరం ప్రసాదించాడు. దానితో ఆ రాక్షసుడు ఆనంద పరవశుడై విజృంభించాడు. దేవ, కిన్నెర, గంధర్వ, కింపురుషాదుల్ని చిత్ర హింసలు పెట్టాడు. విష్ణుభక్తుల్ని పీడించసాగాడు. యజ్ఞాల్ని ధ్వంసం చేయసాగాడు. అతడి ఆకృత్యాలకు అంతంలేకుండా పోయింది.

హిరణ్యకశిపుని బాధలు, దుష్కృత్యాలు భరించ లేక దేవతలు, మునులు శ్రీహరి దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. ఆయన వారికి అభయం ఇచ్చాడు.



ప్రహ్లాదుని మందలిస్తున్న హిరణ్యకశిపుడు

## ప్రహ్లాదుడు

హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు అనే కొడుకు ఉన్నాడు. అతడు విష్ణుభక్తుడు. ఎల్లప్పుడు హరినామ స్మరణం చేస్తుండేవాడు. ఇది హిరణ్య

కశిపునకు కష్టంగా ఉంది. కుమారుని దృష్టిని విష్ణుమూర్తి నుంచి మళ్ళించాలని గురుకులానికి పంపాడు. అక్కడ కూడా అతడు హరినామ సంకీర్తనం చేస్తూ తోటి బాలకుల్ని కూడా విష్ణుభక్తుల్ని చేయసాగాడు. అయినా విద్యలన్నీ బాగా నేర్చుకున్నాడు. హిరణ్యకశిపునకు యీ సంగతి తెలిసింది. ఎన్నోవిధాలుగా చెప్పిచూశాడు. ప్రహ్లాదుడు విష్ణుభక్తి విడవలేదు. భయపెట్టాడు. అయినా అతడి బుద్ధిమారలేదు.

చివరకు యేనుగు చేత తొక్కించారు. ఫలితం లేకపోయింది. పర్వతంపైనుంచి తోయించాడు. శ్రీమన్నారాయణుడే కాపాడాడు. మంటలలో వేయించాడు. అగ్నిదేవుడు చల్లారిపోయాడు. పాములచేత కరిపించబోయాడు. ప్రహ్లాదుని హరినామ సంకీర్తనానికి నాగుపాములు తలలాడించి, వెళ్ళిపోయాయి. తప్ప అతడిని యేమీ చేయలేదు.

దీనితో మరీ కోపగించిన హిరణ్యకశిపుడు విష్ణువు యెక్కడ ఉన్నాడో చూపించమని ప్రహ్లాదుణ్ని శాసించాడు. అప్పుడు ఆ బాలకుడు యిలా అన్నాడు :

"తండ్రీ! శ్రీహరి సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. ఇక్కడ లేడు అనే సందేహం అక్కరలేదు. ఆ చక్రపాణి సర్వాంతర్యామి."

# నరసింహుడు

ప్రహ్లాదుని మాటలు విని హిరణ్యకశిపుడు కోపగించాడు. కుమారుడి హరిభక్తిని పరీక్షించాలని సంకల్పించాడు. అప్పుడు సంధ్యాకాలం కావస్తున్నది. హిరణ్యకశిపుడు గదను చేత బూని "ఈ స్తంభంలోనే శ్రీహరి ఉన్నాడా?" అని ప్రశ్నించాడు :



నరసింహావతారం

"ఉన్నాడు" అని ప్రహ్లాదుడు వినయంగా ధైర్యంగా బదులు చెప్పాడు.

"అయితే చూపించు" అని హిరణ్యకశిపుడు గదతో ఆ స్తంభాన్ని బద్దలు కొట్టసాగాడు. అప్పుడు ప్రహ్లాదుడు చేతులు జోడించి "పాహిమాం! రక్షమాం! శ్రీహరీ!" అని ప్రార్థించాడు.

స్తంభం రెండుగా చీలింది. ఫెళ ఫెళార్భటులు వ్యాపించాయి. ఉరుములు ఉరిమాయి. మెరుపులు మెరిశాయి. సప్త సముద్రాలు ఘోషించాయి.

ఆ సంధ్యాసమయంలో, లోకాన్ని మృత్యుచీకట్లు క్రమ్ముతున్న వేళ ఆ స్తంభం నుంచి దివ్యమైన వెలుగుతో నరసింహస్వామి అవతరించాడు. ఆయనది సింహం తల, మనిషి శరీర, ఒకలంతా మెరుపుతీగల వంటి కేశాలు. చేతులకు వజ్రాలవంటి పదునైన గోళ్ళు. ఆస్వామి మహోగ్రరూపం ధరించి హిరణ్యకశిపునిపై లంఘించాడు. ఆరాక్షసుడు తప్పించుకొన లేకపోయాడు.

ఉగ్రనరసింహమూర్తి హిరణ్యకశిపుణ్ని లాఘవంగా పట్టుకొని ఒక ద్వారం దగ్గరకు లాక్కుపోయాడు. గడపపై తాను ఆసీనుడయాడు. హిరణ్య కశిపుని తన తొడలపై పరుండవేశాడు. గిర గిల తన్నుకొంటున్న హిరణ్య కశిపుని కడుపును తన వాడిగోళ్ళతో చీల్చి, ప్రేగులు పైకి లాగాడు. వాటిని మెడలో వేసుకొన్నాడు.ఆ దానవుని రక్తాన్ని పానంచేశాడు.

అది రాత్రీ కాదు, పగలూ కాదు. సంధ్యాసమయం. నరసింహస్వామి మనిషీ కాదు. మృగమూ కాదు. రెండూ కలిసిన వింత అవతారం. అస్త్రమూ కాదు. శస్త్రమూ కాదు. వాడి గోళ్ళతో హిరణ్యకశిపుని వధించాడు.

ప్రహ్లాదుడు ఆ స్వామిని శాంతపరిచాడు. ఆయన భక్తుల్ని అను గ్రహించి, ఆశీర్వదించి, అంతర్ధానం అయాడు. అతరువాత ప్రహ్లాదుడు

చక్రవర్తియై రాజ్యపాలన చేసి, మహాభాగవతోత్తముడుగా చిరకీర్తిని పొందాడు. ఈకథ సకల విఘ్నహారకం అని భక్తుల విశ్వాసం.

## ఆరుగురు మనువులు

ఇప్పటికి ఆరు కల్పాలు గడిచాయి. మొదట మనువు స్వాయంభువు. రెండవ మనువు స్వారోచిషుడు. మూడవ మనువు ఉత్తముడు. నాలుగవ మనువు పేరు తామసుడు. ఐదవ మనువు రైవతుడు, ఆరవ మనువు పేరు చాక్షుషుడు.

నాలుగవ మనువు తామసుని కాలంలోనే శ్రీహరి మేధాఋషి భార్య అయిన హరిణీదేవి గర్భవాసాన నారాయణమూర్తిగా అవతరించి గజేంద్రుని మొసలిబారినుంచి రక్షించాడు. ఆ కథ చదువుకొందాం.

## గజేంద్రుని వైభవం

అది త్రికూట పర్వతప్రాంతం. ఇది పాలసముద్రంలో వుంది. దీని యెత్తు పదివేల యోజనాలు. ఆ పర్వతాన్ని ఆశ్రయించి రకరకాల మొక్కలు, లతలు, సమ్మలు, వృక్షాలు పెరిగాయి. అదంతా పెద్ద అడవి. అక్కడ యెన్నో రకాల పక్షులు, జంతువులు కాపురం వుంటున్నాయి. అక్కడే వరుణుని ఉద్యాన వనం ఉంది. దానిలో నివసించే ఏనుగుల మందలకు మహా బలవంతుడైన ఒక ఏనుగురాజు. దానిపేరు గజేంద్రుడు. పది లక్షలకోట్ల ఆడయేనుగులకు మగడు. దాని వైభవం, వైభోగం అంతా యింతా కాదు,

అది సపరివారంగా నడిచి వెళుతుంటే పర్వతమే వదిలి వెళుతున్నట్లుండేది. ఒకనాడది తన ఆడపరివారంతో ఒక సరస్సులో జలకాలాట ప్రారంభించింది. ఇష్టంవచ్చినట్లు నీటిని విరజిమ్మసాగింది. తామరతూడులు పెకలించి వేయసాగింది. ఆడ యేనుగులపై తొండంతో నీరు చిమ్మి సరసాలాడింది.

ఇంతలో దాని కాలిని బలమైన మొసలి పట్టుకొని, లోపలకులాగింది గజరాజు పైకి రావాలని పెనుగులాడింది, ప్రయోజనం లేకపోయింది. తమ మగని అవస్థ చూసి, జాలిపడికూడా ఏమీ చేయలేక ఆడయేనుగులు గట్టెక్కిపోయాయి. గజరాజు మొసలిపట్టు నుంచి విడిపించుకోవాలని శాయశక్తులా ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది. మొసలికి నీటిలో బలం యెక్కువ. అందుకే మహాబలవంతమైనప్పటికీ ఏనుగు గట్టెక్కలేకపోతోంది.

శరీరం శుష్కించింది, బలం క్షీణించింది. ఏమీ చేయలేక అప్పుడది తొండం యెత్తి కనులు ఆకాశంవైపు తిప్పి యిలా ప్రార్థించింది:

"శ్రీమన్నారాయణా! ఇన్నాళ్ళూ నాబలం నన్ను కాపాడుతుందని భావించాను. నా బలగం నన్ను రక్షిస్తారని ఆశించాను. కాని నా ఆశలు అడియాస లయాయి. నా శక్తి, యుక్తులు ఉడిగిపోయాయి. నువ్వుతప్ప వేరే రక్షకులు లేరు. కాపాడు, నన్ను రక్షించు."

గజేంద్రుని మొర ఆలకించి శ్రీ మహావిష్ణువు వేగిరం వైకుంఠం నుంచి ఊగి వచ్చాడు. చక్రాయుధం ప్రయోగించాడు. అది గిర్రున తిరుగుతూ వెళ్ళి మకరి తలను ఖండించి వచ్చింది. గజేంద్రుడి కాలు బయట పడింది.

వెంటనే గజేంద్రుడు ఒడ్డుకు వచ్చి శ్రీహరికి నమస్కరించి, ప్రార్థనలు చేసి, తామర పూలతో పూజించాడు. శ్రీ మహావిష్ణువు మకరికి మోక్షం యిచ్చాడు, గజేంద్రుణ్ణి ఉద్ధరించాడు.

గంజేంద్రమోక్షణ కథ సకల శత్రు వినాశకరం అని భాగవత విదుల విశ్వాసం. ఇది తామస మనువుకాలం నాటి కథ. ఇప్పుడు కూర్మావతారం కథ చెప్పుకొందాం.

# దూర్వాసుని శాపం

అది చాక్షుష మనువుకాలం. ఈ కాలంలోనే శ్రీమహావిష్ణువు కూర్మావతారం యెత్తి దేవతలకు ఆ అమృతం పంచి, రాక్షసులను వంచించాడు.

మూడులోకాలను పరిపాలిస్తున్న ఇంద్రుడు ఒకనాడు ఐరావతంపై వచ్చాళ్ళగు భువనాలు తిరుగుతున్నాడు. అదే సమయంలో దుర్వాసమహర్షి వైకుంఠంనుంచి వస్తున్నాడు ఇంద్రుణ్ని చూశాడు. అతడి ముఖంలో వల్ల మాలిన గర్వం తొణికిస లాడుతోంది.

దుర్వాసుడు విష్ణుమూర్తి తనకు యిచ్చిన తులసి దండను ఇంద్రునకు యిచ్చాడు. ఇంద్రుడు దానిని నిర్లక్ష్యంగా ఐరావతానికి అందించాడు. ఆ ఏనుగు ఆ మాలను కాలిక్రింద వేసి చిందర వందర చేసింది. దుర్వాసుడు యింద్రుని

అహంకారాన్ని చూసి కోపగించాడు. మూడులోకాలు తన ఆధీనంలో ఉన్నా యని అతడు గర్విస్తున్నాడని గ్రహించాడు. వెంటనే యిలా శపించాడు:

"ఇంద్రా! అధికార దర్పంతో కన్ను గానకుండా ఉన్నావు. విష్ణు ప్రసాదమైన ఆ తులసిమాలను శిరసున దాల్చవలసినదిపోయి నిర్లక్ష్యంగా ఏను గుకు యిచ్చి అవమానించావు. నీ అహంకారం నశించుగాక. నీ రాజ్యం రాక్షసుల వశం అగుగాక!"

దుర్వాసుడు యిలా శపించి వెళ్లిపోయాడు. కొంతకాలానికి దేవతల శక్తియుక్తులు క్షీణించాయి. బలి అనే రాక్షస చక్రవర్తి విజృంభించి దేవ లోకంపై విజయం సాధించాడు. ఇంద్రుడు అధికారం కోల్పోయాడు. తేజో హీనుడయాడు. ఈ పరిస్థితికి దేవతలు, మునులు యెంతో దుఃఖించారు.

రాక్షసులు మాత్రం అన్నివిధాలా సుఖాలు అనుభవిస్తున్నారు. అధి కారం వారిది ఆనందం వారిది. పరిస్థితి తారుమారు కావడంతో బ్రహ్మ దేవ తలను వెంటబెట్టుకుని వైకుంఠానికి వెళ్ళి శ్రీ మహావిష్ణువును ప్రార్థించాడు. ఆయన ప్రత్యక్షం అయి దేవతల బాధలు విన్నాడు. సముద్ర మథనం చేస్తే అమృతం వస్తుందని, దానిని త్రాగడంవల్ల దేవతలకు మరల దివ్యశక్తి రావడమే కాక అమరత్వం సిద్ధిస్తుందని విష్ణుమూర్తి వారికి హితవు చెప్పాడు.

# సాగర మథనం

లోకాలన్నీ రాక్షసుల అధీనంలో ఉన్నాయి. వారి అనుమతి లేనిదే పాల సముద్రాన్ని మథించే అవకాశం లేదు. అందుకని దేవతలు వారితో సంప్రదించారు. రాక్షసులు సముద్ర మథనానికి అంగీకరించారు.

అందరూ కలిసి, తమ బలాన్ని ఉపయోగించి మంధరాచలాన్ని తవ్వి మోసుకొని వచ్చారు. సముద్రంలో వేశారు. వాసుకి అనే నాగరాజును తెచ్చి కవ్వంగా చుట్టారు. దేవతలు ఆ పాము శిరస్సువైపు ఉంటామన్నారు. దానికి రాక్షసులు అంగీకరించలేదు. పాము తోకభాగం నీచమైనది కనక ఆవైపు తాము ఉండబోమని అన్నారు, దేవతలు రాక్షసులకు వాసుకి తలవైపుభాగాన్ని యిచ్చారు. తాము తోకవైపు భాగాన్ని పట్టుకొన్నారు, వాసుకి వెదజల్లే విష జ్వాలలకు కొందరు రాక్షసులు చచ్చిపోయారు. అయినా లెక్కచేయక సముద్ర మథనం ఆరంభించారు.

# కూర్మావతారం

సముద్రాన్ని మంథరాచలంతో చిలుకుతోంటే మహా శబ్దం వస్తోంది. ఆ ధ్వని దేవతలకు శుభసూచకంగా ఉంది, రాక్షసులకు మృత్యు సదృశంగా వుంది.

అడుగున యే ఆధారం లేకుండా మంథరపర్వతాన్ని తిప్పుచుండడం వల్ల అది సముద్రంలోనికి దిగిపోసాగింది, అప్పుడు దేవతలు శ్రీహరిని ప్రార్థించారు. ఆయన మహా బలవంతమైన తాబేటి రూపం ధరించి పర్వతం క్రింద దూరి. దానిని మూపున దాల్చి పైకి ఎత్తాడు. అదే కూర్మావతారం.



కూర్మావతారం

సాగర మథనం సాగింది తొలుత సముద్రం నుంచి లతలు గుల్మాలు, వృక్షాలు రత్నాలు వచ్చాయి. ఆ తర్వాత హాలాహలం వచ్చింది.

దానిని పరమ శివుడు పానం చేసి కంఠంలో నిలుపుకొన్నాడు. ఆ తర్వాత ఐరావతం, ఉచ్చయిశ్రవం. కల్పవృక్షం, కామధేనువు వచ్చాయి. వాటిని ఇంద్రునకు యిచ్చారు. ఆ తర్వాత లక్ష్మీదేవి పుట్టింది. ఆమెను శ్రీ మహావిష్ణువు వివాహం చేసుకొన్నాడు. ఆ తర్వాత చంద్రుడు పుట్టాడు.

అయినా దేవతలు, రాక్షసులు సంతృప్తి చెందలేదు. అమృతం వచ్చే వరకూ పట్టుదలతో, సాగరమథనం సాగించారు.

## జగన్మోహిని

రత్నాలు ఆవిర్భవించినా సంతృప్తి చెందలేదు. కాకోలవిషం పుట్టినా భయపడలేదు. నిపుణమతులైన దేవ, దానవులు పట్టు విడువక చేసిన అమృతమథనం ఫలించింది. పాల సముద్రం కడుపు నుంచి అమరత్వం ప్రసాదించే అమృతం పుట్టింది. అమృత కలశాన్ని రాక్షసులు అపహరించుకొని పోయారు. దేవతలు అడ్డగించారు. ఉభయులు పోరాడారు. అలిసిపోయారు. అమృతకలశం యెవరికి దక్కాలా అని మీమాంస పడుతూనే ఉన్నారు. ఇంతలో అఖిల లోకాశ్చర్యకరమైన సౌందర్యంతో జగన్మోహిని అనే స్త్రీమూర్తి వారి ముందు ప్రత్యక్షం అయింది.

స్త్రీ జగన్మోహనమైన ఆ రూపం చూసి రాక్షసులు నివ్వెరపోయారు. ఆడవేషం వేసినవాడు శ్రీమహావిష్ణువని దేవతలు గ్రహించారు. ఆ మాయా మానుష వేషధారి యేం చేయనున్నాడో అని ఎదురు చూడసాగారు.

రాక్షసులు ఆ స్త్రీమూర్తివెంట పడ్డారు. అప్పుడు జగన్మోహిని యిలా అంది:

"అమృతకలశం నాకు యివ్వండి. మీ అందరికీ పంచుతాను."

ఆమె సౌందర్యాదర్శంలో విభ్రములై వున్న రాక్షసులు ఆ కలశం ఆమెకు అందించారు. ఆమె దేవ, దానవుల్ని రెండు వరుసలలో కూర్చోబెట్టింది.

రాక్షసుల్ని తన మాటలతో మైమరపించి, జగన్మోహిని అతి నేర్పుగా అమృతాన్ని దేవతలకు పంచిపెట్టింది. క్రమలో పాలుపంచుకొన్న రాక్షసులకు జగన్మోహినీ చిరునవ్వు దక్కింది. దేవతలకు అమృతం లభించి, చిరంజీవులయారు.

అయితే మోహిని చేస్తున్న కపటాన్ని గ్రహించిన రాహువు అనే రాక్షసుడు మాత్రం దేవుడివలె వేషం మార్చి సూర్య చంద్రుల మధ్య చేరాడు.

అమృతం పంచుతున్న మోహినికి సూర్యచంద్రులు కనుసైగచేసి, రాహువు నిజస్వరూపాన్ని తెలియజేశారు. వెంటనే జగన్మోహిని చక్రం ప్రయోగించింది. అప్పటికి రాహువు త్రాగిన అమృతం కంఠాన్ని చేరింది. అదే సమయంలో చక్రం కంఠాన్ని తెగవేసింది. అయినా అమృతం సేవించినందున శిరను బ్రతికి ఉంది. మొండెం మరణించింది. ఆ రాహువుకు బ్రహ్మ గ్రహ

లోకం అనుగ్రహించాడు. అతడే అమావాస్య పూర్ణిమలయందు పగతో సూర్య చంద్రుల్ని గ్రసిస్తాడని, అదే గ్రహణం అని అంటారు.

అమృతసాధన కథ అన్ని రకాల అభీష్టాలను నెరవేరుస్తుందని అనుభవజ్ఞుల మాట.

## వైవస్వత మన్వంతరం

కాలచక్ర పరిభ్రమణంలో ఆరు మన్వంతరాలు గతించాయి. ఏడవ మన్వంతరం నడుస్తోంది. దీని పేరు వైవస్వతుడు. అతడు వివస్వంతుని కుమారుడు. ఈ మన్వంతరంలోనే శ్రీ మహావిష్ణువు వామనుడై జన్మించాడు. ఆకథ చెప్పుకొనేముందు రాబోయే మన్వంతరాలు గురించి తెలుసుకొందాం.

సూర్యునకు సంజ్ఞా ఛాయ అనే ఇద్దరు భార్యలున్నారు. బడబా అనే మూడవ భార్య ఉందని కొందరంటారు. సంజ్ఞా దేవికే బడబా పేరుందని మరి కొందరి మాట. సూర్యునకు సంజ్ఞయందు యముడు, యమీ, వైవస్వతుడు జన్మించారు. ఛాయయందు సావర్ణి శనీశ్వరుడు, తపతి కలిగారు. బడబాయందు అశ్వినీదేవతలు పుట్టారు.

ఎనిమిదవ మనువు సావర్ణి. తొమ్మిదవ మనువు దక్షసావర్ణి. ఇతడు వరుణుని కొడుకు. పదవ మనువు బ్రహ్మసావర్ణి. ఇతడు ఉపశ్లోకుని కొడుకు. పదకొండవ మనువు ధర్మసావర్ణి. పన్నెండవ మనువు రుద్రసావర్ణి. పద

మూడవ మనువు దేవసావర్ణి. పధ్నాలుగవ మనువు ఇంద్రసావర్ణి. ఇవి రాబోయే మన్వంతరాలు. ఇలా మొత్తం పధ్నాలుగు మన్వంతరాలు గురించి భాగవతంలో కాల విభజన వుంది.

# మృత సంజీవని

అమృతాన్ని త్రాగి మరల బల పరాక్రమాలు పొందిన దేవతలు ఇంద్రుని నాయకత్వంలో బలిచక్రవర్తిపై దండయాత్ర చేశారు. దేవతలకు రాక్షసులకు పోరు ఘోరంగా సాగింది.

రాక్షసులు లక్షల సంఖ్యలో మరణించారు. బలిచక్రవర్తి కూడా ప్రాణాలు విడిచాడు.

అయితే రాక్షస గురువైన శుక్రాచార్యుడు మృత సంజీవనీ విద్యతో బలిని బ్రతికించాడు. సర్వావయవాలు వుండి, ప్రాణాలుపోయిన రాక్షసుల్ని అందర్నీ శుక్రుడు తన విద్యా ప్రభావంతో జీవింపజేశాడు. శుక్రునకు యీ విద్య పరమశివుడు యెప్పుడో బోధించాడుట!

పునరుజ్జీవితుడైన బలి గురువు ఆశ్రమంలోనే ఉండిపోయి భృగు వంశీయులైన బ్రాహ్మణుల నందరినీ శ్రద్ధాభక్తులతో సేవించాడు. వారాతనిచేత దివ్యశక్తిని ప్రసాదించే యజ్ఞం చేయించారు. దానినే 'విశ్వదిగ్యాగం' అంటారు.

ఆ యజ్ఞ ఫలంగా బలికి దివ్య రథం వచ్చింది. దివ్యాయుధాలు లభించాయి. [illegible] వచ్చింది. బలి ఎవరో కాదు, ప్రహ్లాదుని మనుమడు.

ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు. అతడి కొడుకు బలి. మనుమనికి ప్రహ్లాదుడు ఎన్నడూ వాడిపోనటువంటి మాలను బహూకరించాడు.

ఇలా బలి సకల విధాలా శక్తి సామర్థ్యాలను కూడదీసుకొని దేవలోకంపై దండెత్తాడు. ఇంద్రుడు యెదురు నిలిచాడు. అయినా బలిచక్రవర్తి యొక్క అవక్ర పరాక్రమం ముందు ఇంద్రుడు నిలువ లేకపోయాడు. దేవలోకాన్ని విడిచి పలాయనం చిత్తగించాడు. దేవలోకం బలికి వశమైంది. ఇంద్రుడు ఎక్కడా తగిన నిలువ నీడలేక అల్లల్లాడు తున్నాడు ఇటు విశ్వకర్మ నిర్మించిన అమరావతి నగరాన్ని బలి అధీనం చేసుకొన్నాడు.

## అమ్మ ఆవేదన

దేవతల తల్లి అదితి.అందుకే వారు ఆదితేయులయారు. వారి తండ్రి కశ్యపుడు. బలి చక్రవర్తి వల్ల తన పిల్లలకు కలిగిన కష్టాలు చూసి అదితి యెంతగానో ఆవేదన పడింది. వారి కష్టాలు తీర్చాలని ఆలోచించింది. భర్తను సలహా అడిగింది. అప్పుడు కశ్యపుడు యిలా అన్నాడు :

"అదితీ! శ్రీమహావిష్ణువు మాత్రమే దేవతల కష్టం గట్టెకించగలడు ఆయనను సేవించు."

కశ్యపుని హితవచనాలు విని అతిది శ్రీమన్నారాయణుణ్ణిఆరాధించింది. కశ్యపుని ద్వారా శ్రీహరి అదితి గర్భాన ప్రవేశించాడు. అతిదికి ప్రసవసమయం ఆసన్నం అయింది.

# వామనుడు

ప్రకృతి సకల శుభప్రదంగా కనిపిస్తోంది. చంద్రుడు శ్రవణా నక్షత్రంలో ఉన్నాడు. అది భాద్రపద శుక్ల ద్వాదశి. అభజి లగ్నం నక్షత్ర గ్రహాదులు ఉన్నత స్థితిలో ఉన్నాయి. అటువంటి మంగళ ప్రదమైన వేళ శ్రీహరి అదితి గర్భాన పుట్టాడు. దేవత లానందించారు. పుట్టినప్పుడు దివ్య శక్తిని ప్రదర్శించిన ఆ బాలుడు. వామనరూపం ధరించాడు. అతడికి కశ్యపుడు, అదితి ఒడుగు చేశారు.

బలిచక్రవర్తి అశ్వమేధయాగం చేస్తున్న సమయం అది. దానానికి అతడికి పెట్టినది పేరు. వామనుడు యాగశాలకు వచ్చాడు. బ్రహ్మవర్చస్సు, క్షాత్రతేజం కలగలిసిన ఆ వటువును బలి అభిమాన పురస్సరంగా వేదిక వద్దకు ఆహ్వానించాడు. వామనవటువును సామగానంతో బలికిఆశీర్వదించాడు.యజ్ఞసమయంలో దాన, ధర్మాలు చేయడం వేదవిహితం. బలి ఆ ప్రకారం విశేషంగా దాన ధర్మాలు చేశాడు.

వామనమూర్తి తనకు "మూడు అడుగుల స్థలం" దానం యిమ్మని కోరాడు. బలి యిస్తానన్నాడు. రాక్షస కులగురువు శుక్రాచార్యుడు అడ్డగించాడు. అయినా బలి వినలేదు. ఇచ్చిన మాట తప్పనన్నాడు. వామన మూర్తికి మూడడుగుల నేల దానం చేశాడు.



ఇంతింతై .... వటుడింతై ....

## ఇంతింతై ... వటుడంతై

వామనమూర్తి నేలను దానం తీసుకొన్నాడు. శరీరాన్ని పెంచాడు. ఒక పాదంతో భూమిని కొలిచాడు. రెండవ పాదంతో విశాలసృష్టి అంతటినీ, కొలిచాడు. బొటన వ్రేల పరిమాణంలో కనిపించిన వటువు చూస్తుండగానే ఇంతింతై, ఎదిగి పోయాడు. పాదం మోపడానికి యెక్కడా స్థలంలేదు. ఈ త్రివిక్రమ విజృంభణ రూపాన్ని పోతన్న భాగవతంలో అద్భుతంగా వర్ణించారు.

మూడవ పాదం యెక్కడ మోపమన్నావని వామనుడు అడగగా బలి శిరస్సు చూపించాడు. వామనుడు తన పాదాన్ని బలి తలపై ఉంచి, అతడికి రసాతలానికి అణగ త్రొక్కాడు.

బలచక్రవర్తి తనకు దానం చేసిన ఈ చతుర్దశభువనాలను వామనుడు ఇంద్రునికి యిచ్చి తన అవతారాన్ని ముగించి అంతర్ధానం అయ్యాడు.

వామనావతార కథ అన్ని కోరికలు తీరుస్తుందని పెద్దలు చెబుతారు.

## మత్స్యావతారం

కల్పాంతం నాటిమాట. బ్రహ్మయోగ నిద్రలో ఉన్నాడు! ఆయన ముఖాలనుంచి వేదాలు పుట్టాయి. ఆ సమయంలో అక్కడ పొంచి ఉన్న

హయగ్రీవుడు అనే రాక్షసుడు ఆ వేదాలను అపహరించుకొని పోయాడు. అతడినే సోమకాసురుడు అని కూడా అంటారు.



మ త్స్యా వ తా ర ం

ఆ కాలంలో సత్యవ్రతుడు అనే రాజుండేవాడు, అతడు మహావిష్ణు భక్తుడు. ఒకనాడాయన నదిలో స్నానం చేసి, సంధ్యా వందనం చేసి, అర్ఘ్యం యిస్తుండగా ఒక చేప ఆయన దోసిలి లోనికి వచ్చి యిలా అంది :

"సత్యవ్రతా! నేను నీ ఆరాధ్య దైవం అయిన విష్ణుమూర్తిని. లోక కళ్యాణం కోసం యీ చేప అవతారం యెత్తాను. నన్ను పెంచు కొన్నాళ్ళకు

ప్రళయం వస్తుంది. అప్పుడు ఒక నావ వస్తుంది. దానిలో సప్తర్షుల్ని ధాన్యాల్ని ఉంచు. నువ్వూ అందులో ఉండు. ఒక తాటితో ఆ నావను నాముక్కున గల కొమ్ముకు కట్టు నేను ప్రళయం అయేవరకు ఆ నావను సముద్రంలో త్రిప్పుతూ ఈ సృష్టిని రక్షిస్తాను.

సత్యవ్రతుడు భగవానుని స్తుతించి ఆ చేపను పెద్ద సరస్సులో వేశాడు. అది సరస్సు పట్టనంతగా పెరిగి పోయింది. మరొక సరస్సులో వేశాడు. అక్కడా అది పెరిగింది. ఇలా ఆ చేప విశ్వాకారం ధరించింది.

తర్వాత ఆ మహావిష్ణువు చెప్పినట్లు ప్రళయం వచ్చింది. సత్య వ్రతుడు ధాన్యాల్ని సేకరించాడు. సప్తఋషుల్ని ఆహ్వానించాడు. ఇంతలో ఆ ప్రళయ జలంలో పెద్ద నావ వచ్చింది. ఋషులు దానిలో ఎక్కారు.సత్యవ్రతుడు ధాన్యాలను దానిలో భద్రపరచి తానూ పడవ ఎక్కాడు.

మరుక్షణంలో మత్స్యమూర్తి ప్రత్యక్షం అయ్యాడు. ఆ చేప ముక్కున గల కొమ్ముకు సత్యవ్రతుడు పడవ త్రాడును కట్టాడు. మత్స్య రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువు ఆ పడవను ప్రళయ జలరాశిలో త్రిప్పుతూ నడిపాడు.

ప్రళయం అంతం అయింది. కొత్త కల్పం వచ్చింది. ఆ పడవలో మిగిల్చిన ధాన్యముతో సృష్టి జరిగింది. అంత బ్రహ్మవేదాలు హయగ్రీవుని దగ్గరే ఉన్నాయి అప్పుడు మత్స్యమూర్తి ఆ రాక్షసుణ్ణి చంపి వేదాలు తెచ్చి బ్రహ్మకు యిచ్చాడు. బ్రహ్మ ఆ వేదానుశాసనాన్ని అనుసరించి సృష్టి కొన సాగించాడు.

ఈ విధంగా శ్రీహరి మత్స్యావతారం యెత్తిలోకోపకారం చేసిన యీ కథ చదివిన వారికి పోయిన వస్తువులు తిరిగి లభించి, శుభాలు కలుగుతా యని అంటారు.

ఇక్కడితో చతుర్థ పంచమ షష్ఠి సప్తమ, అష్టమ స్కంధాల కథ సంగ్రహంగా పూర్తి అయింది.

తొమ్మిదవ స్కంధంలో వైవస్వత మనువంశ విస్తరణ చ్యవనుడికథ ఇక్ష్వాకు, త్రిశంకు, హరిచంద్రుల కథలు యయాతి గాథ, పురు, భరత వంశాల వివరం మొదలైనవి వర్ణితమైనాయి. ఈ స్కంధంలోని అంబరీషుని కథ యిప్పుడు చెప్పుకొందాం.

## అంబరీషుడు

ఎన్నో వేల సంవత్సరాల నాటిమాట. అంబరీషుడు అనే చక్రవర్తి యీ ప్రపంచాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన మాహావిష్ణుభక్తుడు. నిరంతరం శ్రీహరిని సేవిస్తూ ప్రజారంజకంగా పరిపాలన చేస్తూన్నాడు. ఆయన భక్తికి మెచ్చి విష్ణుమూర్తి అంబరీషునకు సుదర్శన చక్రాన్ని యిచ్చాడు.

అది అంబరీషుణ్ణీ ఆయన రాజ్యాన్ని ఎప్పుడూ రక్షిస్తూండేది. ఒక సారి అంబరీషుడు కార్తీకమాసంలో ఏకాదశీవ్రతం చేశాడు. ద్వాదశినాడు పూజ చేశాడు. ఆ రోజున దుర్వాసుడు ఆతిథ్యానికి వస్తానన్నాడు. అంబరీషుడు సాదరంగా అంగీకరించాడు.

దుర్వాసుడు సంధ్యావిధి నిర్వర్తించడానికై నదికి వెళ్ళాడు. ఎంత సేపటికీ రాలేదు. ద్వాదశి ఘడియలు వెళ్ళకుండా భోజనం చేయాలి. దుర్వాసుడు రాకుండా యెలా భోజనం చేయగలడు.

అంబరీషునకు ధర్మ మీమాంస యెదురయింది. అప్పుడు బ్రాహ్మణ శ్రేష్ఠులను సంప్రదించగా వారిలా అన్నారు.

"అంబరీషా ద్వాదశి ఘడియలు ముగియకుండా ప్రసాదం స్వీకరించాలి. అలా అని అతిథి రాకుండా ఆహారం స్వీకరించరాదు. ఇటువంటి పరిస్థితిలో నీరు త్రాగవచ్చు."

ధర్మశాస్త్రాన్ని అనుసరించి అంబరీషుడు మూడు ఉద్ధరిణుల తులసీ తీర్థం సేవించాడు. ద్వాదశివిధిని నిర్వర్తించినట్లు భావించాడు.

ఇంతలో దుర్వాసుడు వచ్చాడు. తాను రాకుండా అంబరీషుడు ద్వాదశి భోజనం చేశాడని భ్రమపడి తెలుసుకోకుండానే ఆతడిపై కోపగించాడు. దుర్వాసుని కోపాగ్ని నుండి 'కృత్య' అనే శక్తి ఆవిర్భవించింది. అది భయంకరంగా అరిచి అంబరీషునిపై పడి చంపాలని ముందుకు వచ్చింది.

అయితే అంబరీషున్ని నిరంతరం కాపాడుతుండే సుదర్శన చక్రం రివ్వున వచ్చి అ శక్తిని చంపి, భస్మంచేసి దుర్వాసుని వైపు వెళ్ళింది.

తనను చంపాలని సుదర్శన చక్రం వేగంగా రావడంచూసి దుర్వాసుడు భయంతో పారిపోయాడు, అయినా ఆ చక్రం విడువక వెంబడించింది. ఆ ఋషి మేరుపర్వత గుహలో దాక్కొన్నాడు, అయినా సుదర్శనచక్రం విడిచిపెట్టలేదు. దుర్వాసుడు సముద్రంలో దాగాడు. సుదర్శనం వెంబడించింది. ఆతడు బ్రహ్మలోకం వెళ్ళాడు కైలాసం వెళ్ళాడు ఎవ్వరు రక్షించ లేమన్నారు.

దుర్వాసుడు ప్రాణాలు అరచేత పెట్టుకొని వైకుంఠం వెళ్ళి విష్ణు మూర్తిని శరణుకోరాడు. విష్ణుమూర్తి తానుకూడా యేమీచేయలేనన్నాడు.



దుర్వాస—అంబరీషులు

అప్పుడు దుర్వాసుడు పశ్చాత్తాప పడ్డాడు. మహాభక్తుడైన అంబరీషున్ని శరణు వేడాడు. తనకు ప్రాణభిక్ష పెట్టమని వేడుకొన్నాడు. అంబరీషుడు దుర్వాసునికి అభయం యిచ్చాడు.

సుదర్శనచక్రాన్ని శాంతించ మని ప్రార్థించాడు అది శాంతించి, వెను దిరిగి మాయమయింది. దుర్వాసుడు అంబరీషుని ఆశీర్వదించి వెళ్ళాడు. అంబరీషుడు అచంచలమైన విష్ణుభక్తితో చిరకీర్తిని పొందాడు.

అంబరీషుని యితిహాస పఠనం సకల శత్రు వినాశకరం అని భక్తుల భావం.

# పరశురాముడు

యుగయుగాల నాటి సంగతి హైహయ దేశానికి చక్రవర్తి కార్తవీర్యార్జునుడు. అతడి రాజధాని పేరు మాహిష్మతీనగరం. కార్తవీర్యార్జునుడు మహాబలవంతుడు. వెయ్యి చేతులవాడు అతడు దత్తాత్రేయుని వరం వల్ల మహా వీరుడయ్యాడు.

ఒకనాడు రేవా నదిలో అతడు తన అంతఃపుర పరివారంతో జలకాలాడు తున్నాడు. వెయ్యిచేతులు జలానికి అడ్డురావడంతో నది దిగువకు నీరు ప్రవహించడం ఆగిపోయింది.

నది దిగువ ప్రదేశంలో ఒకచోట అదేసమయంలో రావణుడు సంధ్యావందనం చేసుకొంటున్నాడు. నదిలో నీటి ప్రవాహం ఆగిపోవడంతో అతడు ఆగ్రహించి అటుయిటు చూశాడు. అల్లంత దూరాన కార్తవీర్యుడు కనిపించాడు రావణునకు పరిస్థితి అర్థం అయింది.

వెంటనే కార్తవీర్యునిపై విరుచుకొని పడినాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది, కార్తవీర్యార్జునుడి పరాక్రమం ముందు రావణుడు నిలువలేక పోయి నాడు. అతనికి బందీఅయినాడు.



పరశురామ పరాక్రమం

మహిష్మతీ నగరంలో కార్తవీర్యుని సైనికులు రావణాసురుణ్ణి "పదితలల పడగు" అని గేలి చేసి, ఆడుకొని, విసిరి వేశారు. రావణుడు చావుతప్పి కన్నులొట్టపోయినట్లు ప్రాణాలు దక్కించుకొని లంకా నగరం చేరాడు.

అటువంటి బలపరాక్రమాలుగల కార్తవీర్యార్జునుడు ఒకనాడు అడవికి వేటకై వెళ్ళాడు. బాగా వేటాడి అలసిపోయాడు. దగ్గరలోని జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళాడు.

ఆ మహర్షి చక్రవర్తికి అన్ని మర్యాదలు చేశాడు. ఆయనకు ఆ సైన్యానికి షడ్రసోపేతమైన విందు యిచ్చాడు. కార్తవీర్యార్జునుడు యెంతో సంతోషించాడు. ఇంతటి గొప్ప విందు యెలా యివ్వగలిగావని అడిగాడు. అప్పుడు జయదగ్ని తన దగ్గర 'కామధేనువు' ఉన్నదని. అది యెప్పుడు యేమి అడిగినా యిస్తుందని చెప్పాడు.

ఆ ఆవును తనకు యిమ్మని కార్తవీర్యుడు జమదగ్నిని అడిగాడు. ఆయన నిరాకరించాడు. అయినా వినక చక్రవర్తి కామధేనువును బలవంతంగా తీసుకొని రాజధానికి వెళ్ళిపోయాడు.

జమదగ్ని కొడుకు పరశురాముడు. అతడు విష్ణుమూర్తి అంశంవల్ల జన్మించిన మహాపరాక్రమశాలి. కార్తవీర్యార్జునుడు ఆశ్రమానికి వచ్చినప్పుడు పరశురాముడు ఆశ్రమంలో లేడు. ఆశ్రమానికి వచ్చి కార్తవీర్యుడు కామధేనువును అపహరించుకొని పోయాడని విని పరశురాముడు కోపగించాడు.

తన దివ్యాయుధం అయిన గండ్రగొడ్డలిని చేతపట్టుకొని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు. కార్తవీర్యునిపై యుద్ధం ప్రకటించాడు. ఇద్దరికీ భయంకరంగా పోరు సాగింది. పరశురాముడు గండ్ర గొడ్డలితో కార్తవీర్యార్జునుడి వెయ్యి చేతులను నరికి పోగులు పెట్టాడు. తలను నరికి దిగ్విజయంగా ఆశ్రమానికి వచ్చాడు.

ఆ తర్వాత కార్తవీర్యుని కొడుకులు ఒకసారి జమదగ్ని ఆశ్రమంపై దండెత్తి వచ్చారు. ఆ సమయంలో పరశురాముడు ఆశ్రమంలో లేడు. పైగా జమదగ్ని తపోసమాధిలో ఉన్నాడు. అప్పుడు వారు జమదగ్నిని చంపి మాహిష్మతికి వెళ్ళిపోయారు.

పరశురాముడు తిరిగి వచ్చి తండ్రి మరణించి ఉండడం చూశాడు. కార్తవీర్యుని కొడుకులు ఈ హత్యచేశారని తెలుసుకొన్నాడు. వెంటనే మహిష్మతికి వెళ్ళి కార్తవీర్యార్జునుని కొడుకుల్ని చంపాడు.

రాజవంశాలపై కత్తి గట్టి ఇరవై ఒక్కమారులు దుష్టులైన రాజుల్ని చంపాడు. శమంత పంచక క్షేత్రంలో ఆ రాజుల రక్తంలో తొమ్మిది మడుగులు నిర్మించాడు. తన తండ్రి తలను శరీరానికి అంటించి బ్రతికించాడు. సరస్వతీ నదిలో స్నానం చేసి తపస్సుకు వెళ్ళిపోయాడు.

కాలాంతరంలో శ్రీమహావిష్ణువు రాముడుగా అవతరించి నప్పుడు ఈ పరశురాముడే వైష్ణవచాపాన్ని అతడి కిచ్చి తన అవతారాన్ని ముగించాడు. పరశురాముని పవిత్రకథ సకల ఫలప్రదాయిని అని పెద్దలంటారు.



## శ్రీరాముడు

ఇరవై నాలుగవ మహాయుగంలో త్రేతా ద్వాపరయుగ సంధి కాలం అది శ్రీమహావిష్ణువు దశరధుని యింట రాముడుగా అవతరించాడు. విశ్వామిత్రుని యాగాన్ని రక్షించాడు సీతను వివాహం చేసుకొన్నాడు. తండ్రి ఆజ్ఞను అనుసరించి అరణ్యవాసం చేశాడు. దుష్టరాక్షసులు యెందరినో చంపాడు.

సుగ్రీవునితో మైత్రి చేశాడు. రావణాసురుడు సీతను అపహరించుకొనిపోగా లంకపై దండెత్తి రావణుని చంపి, సీత చెర విడిపించాడు. విభీషణుణ్ని లంకకు చక్రవర్తిగా అభిషేకించాడు.

అయోధ్యకు తిరిగివచ్చి, పట్టాభిషిక్తుడై ప్రజారంజకంగా పరిపాలన చేశాడు. రాముడికథను రామాయణంగా వాల్మీకి వ్రాశాడు. (మాబాలానంద బొమ్మల రామాయణంలో రామకథ విడిగా చదవండి)

ఇక్కడితో తొమ్మిది స్కంధాలు పూర్తి అయ్యాయి. పదవ స్కంధం కృష్ణుడి కథ.



# కృష్ణుడి కథ

కాలచక్రం గిరగిర తిరిగింది. ఇరవై యెనిమిదవ మహాయుగంలో ద్వాపర, కలియుగ సంధికాలం వచ్చింది. అప్పుడు యెందరో దుష్టులు సజ్జనులను హింసించారు. వారినే రాక్షసులనే వారు. అటువంటి వారిలో కంసుడు ఒకడు.



కారాగారంలో దేవకీ—వసుదేవులు

అతడు యెన్నో దుష్కృత్యాలు చేశాడు. కంసునితో సహా యెందరో రాక్షసుల్ని చంపి లోకకళ్యాణం సమకుర్చాడు శ్రీహరి. అందుచే కృష్ణావతారం యెత్తాడు.

కృష్ణావతారంవిశేషాలతో భాగవతం దశమస్కంధం సాగుతుంది. ఆ వివరం స్థూలంగా చెప్పుకొందాం.

యాదవుల రాజ్యానికి ముఖ్యపట్టణం మధురానగరం. యాదవుల మహారాజు శూరసేనుడు అతని కుమారుడు వసుదేవుడు. అతడి భార్య దేవకి. ఆమెకు పెత్తండ్రి కొడుకు కంసుడు. ఆ రకంగా వారిరువురు అన్నాచెల్లెళ్ళవరస

దేవకిని వసుదేవున కిచ్చి వివాహం చేశారు. వారిరువురిని రథంపై కూర్చుండ బెట్టుకొని కంసుడు మధురానగరానికి బయలుదేరాడు. రథం సాఫీగా సాగిపోతోంది.

## కంసుడి దౌష్ట్యం

రథం వేగంగా నడుస్తోంది. ఇంతలో కంసునికి ఆకాశవాణి వినిపించింది.

"కంసా! దేవకీ వసుదేవుల్ని యింత ఆదరంగా తీసుకొని వెళు తున్నావు కాని వారి గర్భవాసాన జన్మించే ఎనిమిదవ కొడుకు నిన్ను సంహ రిస్తాడు."

అకాశవాణి పలుకులకు కంసుడు తొలుత ఆశ్చర్య పడ్డాడు. తర్వాత భయపడ్డాడు. ఆపైన అతనితో కోపం తల యెత్తింది. అంత వరకు చెల్లెలిపై గల ప్రేమాదరాలు పగగా మారాయి.

రథం ఆపాడు. దేవకిని చంపబోయాడు. అప్పుడువసుదేవుడు యిలా ప్రార్థించాడు.

"కంసా! నువ్వు చక్రవర్తివి. స్త్రీని సంహరించడం నీకు తగదు. అందులో కొత్తగా వివాహం అయిన చెల్లెల్ని చంపడం నీకు మంచిపని కాదు. మా పిల్లల్ని నీకు అప్పగిస్తాం. ఆ పిల్లల్ని చంపు నీకే ప్రమాదం ఉండదు.

వసుదేవుని మాటలు కంసుడికి కొంత వరకు ఉపశమనం కల్గించాయి. చెల్లెల్ని చంపానన్న అపకీర్తి రారాదని భావించి, వారినివిడిచి పెట్టాడు.

తర్వాత యాదవరాజ్యాన్ని జయించి తన చెప్పుచేతలలో ఉంచుకొన్నాడు. వారిపై అత్యాచారాలు చేశాడు. ఈలోగా అతనికి ఒక సంగతి తెలిసింది.

"దేవతలు అనేక రూపాలలో యాదవ వంశంలో జన్మిస్తున్నారు. వారందరు కంసుని రాజ్యన్ని జయిస్తారు. కంసుని సంహరించడానికి శ్రీహరి అవతారం యెత్తుతాడు."

దీనితో ఆగ్రహించిన కంసుడు దేవకీ, వసుదేవుల్ని కారాగారంలో బంధించాడు. ఇదివరకు విడిచి పెట్టిన పిల్లల్ని వధించాడు. యాదవవంశంలో జన్మించిన మగ పిల్లల్ని చంపడం పనిగా పెట్టుకొన్నాడు. కంసుని దౌష్ట్యాన్ని మందలించిన తండ్రి ఉగ్రసేనుణ్ని కూడా అతడు కారాగారంలో బంధించాడు. కంసుని పరిపాలనలో ప్రజలు పడుతున్న కష్టాలకు మితి లేకుండా పోయింది.



# దేవకి పొత్తిళ్ళలో దేవ దేవుడు

ప్రపంచంలో పాపం పెరిగినప్పుడు, దుష్టులు విజృంభించి నప్పుడు శ్రీమహావిష్ణువు అవతరిస్తాడు. అది సంప్రదాయం. ఆ సమయంరానే వచ్చింది. కంసుని దురాగతాలు మితిమీరాయి. దేవతలు సాధువులు శ్రీహరిని ప్రార్థించారు. ఆయన వారికి అభయం యిచ్చాడు.



శ్రీకృష్ణ జననం

ఆదిశేషుని అంశ భూలోకానికి అవతరించింది. వసుదేవుని మరొక భార్య అయిన రోహిణి యందు బలరాముడుగా జన్మించాడు.

దేవకి మరల గర్భం ధరించింది. అది యెనిమిదవ గర్భం అగర్భాన జన్మించే శిశువే తనకు కుమారుడుఅవుతాడని కంసుడు అక్కడగట్టికాపల ఏర్పరి చాడు. దేవకికి నెలలు నిండాయి. ఒకనాటి రాత్రి గ్రహాలు, నక్షత్రాలు ఉచ్ఛస్థితిలో ఉండగా దేవకి ప్రసవించింది. ఆమెకు విష్ణుమూర్తే శిశువుగా జన్మించాడు. అన్నీ శుభశకునాలే ఆ సమయంలో కనిపించాయి.

దైవమాయవల్ల కాబోలు అంతవరకు మెలకువగా ఉన్న కాపలా దారులు నిద్రపోయారు. మేఘాలు కమ్ముకు వచ్చాయి. వాన కురవ సాగింది.

దేవకి తన కుమారుణ్ని అక్కున చేర్చుకొని ముద్దాడింది. దివ్య కాంతు లీనుతున్న ఆ బాలుడ్ని కంసుడి బారి నుండి కాపాడాలని భావించింది. భర్తను సంప్రదించింది. వసుదేవుడు బాలుడ్ని చిన్నబుట్టలో పెట్టుకొని వ్రేపల్లె వైపు బయలుదేరాడు. దైవలీలవల్ల బైట తలుపులు తెరుచుకొన్నాయి. ఎటువంటి విఘ్నాలు లేకుండా అతడు యమునా నదిని చేరాడు. వర్షం పెరిగింది. అయితే శ్రీహరి వస్తున్నాడని యమున దారియిచ్చినది. బుట్టలోని పసికందుకు వర్ష బాధ లేకుండా ఆదిశేషుడు పడగ పట్టాడు.

వసుదేవుడు వ్రేపల్లె చేరాడు. నందుని యింటికి వెళ్ళాడు. నందుని భార్య యశోద ఆమె ఆడశిశువును కని ఉంది. వసుదేవుడు నందుడితో మాట్లాడి తన బిడ్డను వారి దగ్గర ఉంచి, యశోద కనిన ఆడపిల్లను తీసుకొని వేగంగా కారాగారానికి తిరిగి వచ్చేశాడు.

దేవబాలుడు వెళ్ళిపోయి మాయాబాలిక ఖైదులోనికి రావడంతోనే కాపలా దారులకు మెలకువ వచ్చింది. ఆ పాప కూడా కేరుకేరున ఏడవసాగింది. కంసునికి కబురువెళ్ళింది.

ఆ యెనిమిదవ శిశువును సంహరించాలని కంసుడు కత్తి చేతబట్టి కారాగారానికి వచ్చాడు. ఆడశిశువు అని తెలిసింది. అయినా సరే అష్టమగర్భాన పుట్టిన వారు తనకు గండం అని భావించి చంపాలని నిశ్చయించాడు.



నదిని దాటుతున్న వసుదేవుడు

శిశువును పైకి విసిరాడు. ఇంతలో ఆకాశవాణి వినిపించింది. పైకి చూశాడు, అక్కడ శిశువు లేదు. శక్తిరూపంవుంది. కంసుని ఆశ్చర్యానికి అంతం లేదు. ఆతనిని భయ విభ్రాంతం చేస్తూ ఆ మాయాశక్తి యిలా అంది:

"కంసా! నేను కాలశక్తిని. నిన్ను చంపే బాలుడు వ్రేపల్లెలో ఉన్నాడు నీకు ఆయువు మూడింది."

ఈ మాటలని శక్తి మాయం అయింది. కంసునికి భయం, కోపం, ఆశ్చర్యం ముప్పిరిగొన్నాయి. తన ప్రాణం తీసే మగశిశువు వ్రేపల్లెలో ఉన్నాడని తెలుసుకొని కంసుడు మండి పడ్డాడు.

ఆ బాలకుడి ఆచూకీ తీయమని తన అనుచరులైన రాక్షసుల్ని వ్రేపల్లెకు పంపాడు. వారు మారువేషాలు వేసుకొని రేపల్లెలో తిరుగుతున్నారు.

## పూతన

అలా మారువేషాలలో వ్రేపల్లెలో తిరుగుతున్న రాక్షసులలో పూతన మాయాశక్తులుగల రాక్షస స్త్రీ ఆమె అందమైన స్త్రీ వేషం వేసుకొని రేపల్లె వీధులలో తిరుగుతూ చంటి పిల్లలకు పాలివ్వసాగింది.

అప్పటికి పాకడం నేర్చిన బాలకృష్ణుడు కూడా ఆమెదగ్గర పాలు త్రాగాలని వచ్చాడు. అప్పుడు పూతన తన శాంబరీవిద్య ఉపయోగించి ఆ బాలుడే శ్రీహరిఅని కంసుని చంపడానికై దేవకి కొడుకుగా అవతరించాడని గుర్తించింది.

వెంటనే తన స్తనాలకు విషం రాసుకొంది. బాలకృష్ణుణ్ని ఎత్తుకొని ముద్దాడింది. పైట తీసి పాలు అందించిది. కృష్ణుడు ఆమె చనులకు రాసుకొన్న

విషం ఆరగించుకొన్నాడు. పాలు జీర్ణం చేసుకొన్నాడు ఆమె నెత్తురు పీల్చి చంపాడు.



పూతన సంహారం

అంతవరకు అందమైన స్త్రీగా ఉన్న ఆమె ప్రాణాలు విడుస్తూ అసలు రాక్షసిగా మారిపోయింది. కృష్ణుడు మహా రాక్షసిని చంపాడన్న వార్త వ్రేపల్లెలో వ్యాపించింది.

అలాగే శకటాసురుడనే రాక్షసుడు కృష్ణుణ్ని చంపాలని బండి వేషం వేసుకొని రాగా, బాలకృష్ణుడు వాడిని కాలితో తన్ని చంపాడు.

# సుడిగాలిలో రాక్షసుడు

బాలకృష్ణుణ్ని యెలాగయినా చంపాలని కంసుడు పంపిన రాక్షసులు ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అటువంటి వారిలో తృణావర్తుడు అనే రాక్షసుడొకడు ఒకనాడు కృష్ణుడు తోటి పిల్లలతో ఆటలాడుకొంటున్నాడు. అన్ని ఆటలలో అతడిదే పై చెయ్యి. అందరూ ఆటలలో లీనమై ఉన్నారు.



తృణావర్తుని వధ

ఇంతలో పెద్దగాలి వచ్చింది. పిల్లలు భయపడి అటుఇటు చెదిరి పోయారు. కృష్ణుడు మాత్రం ధైర్యంగా నిలబడి ఆ పెనుగాలిని చూడసాగాడు.

పెనుగాలి సుడిగాలిగా మారింది. బాలకృష్ణుణ్ని గిరగిర తిప్పి ఆ గాలి అతణ్ణి పైకి ఎగర వేసుకొని పోయింది

బాలకృష్ణుడు మొదట గింగురులు తిరిగాడు, అంతలోనే అది రాక్షస మాయ అని గుర్తించాడు. ఆ సుడిగాలి మధ్య దాగి తనను ఎగరవేసుకొని పోతున్న రాక్షసుణ్ణి పసిగట్టాడు. వెంటనే పిడికిలి బిగించి రాక్షసుణి నరాలు చిట్లేలా గుద్దాడు. అంతేకాదు తన బలాన్ని పెంచాడు. బాలకృష్ణుడి ముష్టిఘాతా లకు అతడి బరువుకు రాక్షసుడు తట్టుకొన లేక పోతాడు. నెత్తురు కక్కుతూ నేలకు వాలిపోసాగాడు. కృష్ణుడు ఆ రాక్షసుడి చెవి మెలిపెడుతూ క్రిందకు దిగాడు కృష్ణుడి దెబ్బలకు ఆ రాక్షసుడు మరణించాడు. వాడెవరో కాదు. తృణా వర్తుడు బాలకృష్ణుని సాహసాన్ని రేపల్లెలో అందరు పొగిడారు.

# నల్లదొంగ

నీలమేఘచ్ఛాయతో, అందర్నీ ఆకర్షించే బాలకృష్ణుడు యెన్నో చిలిపి పనులు చేసేవాడు గోశాలలలో ప్రవేశించి ఆవులపాలు త్రాగి, వెళ్ళిపోయే ముందు దూడల్నివదిలి పరుగు పెట్టేవాడు పొగరిమోతు పోట్లగిత్తల తోక లకు తాటాకులు కట్టివాటిని బెదరగొట్టేవాడు.

ఆవీధి ఈవీధి తిరిగి వుట్లపై పాలు, పెరుగు త్రాగేసి, స్నేహితులకు పంచి పెట్టేవాడు. వెన్న తినేసి, నిద్రపోయిన ఆయా యిళ్ళలోని కోడళ్ళ

మూతులకు రాసి, పారిపోయేవాడు. దానితో అత్త కోడళ్ళ జగడాలు రగిలే దూరంగా ఉండి వినోదం చూసేవాడు.

ఇలా వ్రేపల్లెలో ప్రతి యిల్లు కృష్ణుని దొంగపనులతో గగ్గోలె తుంది. అతడి ఆగడాలు భరించలేక గోపకాంతలు యశోదకు ఫిర్యాదు చేశా "నల్లదొంగ" అని కృష్ణుణ్ని ఆడిపోశారు. తమ బ్రతుకుల్ని బజారు పా చేస్తున్నాడని కట్టడి చేయమని యశోదకు నూరిపోశారు. ఆమెకు కో వచ్చింది.

## ముఖంలో మూడు లోకాలు

గోప కాంతలు చాడీలు చెప్పి వెళ్ళిన కొంతసేపటికి నల్లదొ కృష్ణయ్య యింటికి వచ్చాడు. అతడి నోటినిండా మన్ను ఉంది. బలరామున్న తల్లికి తమ్ముడు మన్ను తిన్నాడని చెప్పాడు. యశోద బాలకృష్ణయ్యను పట్టుకొ నోరు తెరిచి చూపమంది. కృష్ణుడు అమాయకంగా నోరు తెరిచాడు.

యశోద ఆశ్చర్యానికి అంతం లేదు. అతడి నోటిలో మూడులోకా సృష్టి స్థితి లయాలు కనిపించాయి. అగ్ని వాయువు సూర్యచంద్రాది గ్రహా కోటాను కోట్లు జీవరాశి ఆ బాలుని వదనంలో కనిపించాయి. ఆమె భ్రమ తొలగింది! చేయెత్తి దండం పెట్టబోయి బాలకృష్ణుణ్ని ఆశీర్వదించి అక్కున చేర్చుకొంది.

బాలకృష్ణుడు పకపక నవ్వాడు అంతలోనే యశోదకు స్పృహ వచ్చింది. తన కృష్ణుణ్ని అందరూ "నల్లదొంగ వెన్నదొంగ" అని తిట్టడం



దొరికిపోయిన వెన్నదొంగ

చెవులలో మారుమోగింది. వెంటనే ఆయమ్మ కృష్ణయ్యను గట్టిగా పట్టుకొంది.

## మొలత్రాడుకు రోలు

బాలకృష్ణుడి వెండి మొలత్రాడుకు రోలు ఒకదానికి కట్టింది. అలాచేస్తే ఆ బాలుడు యిల్లు విడిచి ఎటూ పోడని యశోద ఆలోచన.

బాలకృష్ణుడు కాసేపు ఆ రోటిని అటు యిటు దొర్లిస్తూ తిరిగాడు. వారి యింటి పెరడులో రెండు మద్ది చెట్లున్నాయి. కృష్ణుడు రోలును లాగుతూ ఆటు వైపు వెళ్ళాడు. అతడు చెట్లుమధ్య నుంచి ఆవైపు ప్రాకాడు. కాని రోలు చెట్ల సందున యిరుక్కుపోయింది.



గంధర్వుల శాపవిమోచనం

కృష్ణుడు బలంగా వాటిని లాగాడు. ఆ కుదుపునకు ఆ చెట్లు రెండు నేలపడాయి. ఆ చెట్లనుంచి గంధర్వులు వచ్చారు. వారు కుబేరుని పుత్రులు. వారి

పేర్లు నలకూబరుడు, మణిగ్రీవుడు, శాపం వల్ల అలా చెట్లయి నూరేళ్ళుగా దైవధ్యానం చేస్తున్నారు.

కృష్ణుని స్పర్శవల్ల వారికి శాపవిమోచనం కలిగింది. వారిరువురు, లీలామానుష వేషధారి, అయిన శ్రీహరికి నమస్కరించి మాయం అయారు.

దూరాన ఉండి యీ దృశ్యం చూసిన నందుడు యశోద కృష్ణుడి మహిమ తెలుసుకొన్నారు. జనోద్ధరణకై జన్మించిన ఆ శిశువుకు వ్రేపల్లెలో రక్షణ ఉండదని వారిరువురు భావించారు. అక్కడ నుంచి బృందావనం వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నారు. గోపకులుకూడ అంగీకరించారు. తమ మధ్య మనుష్యరూపంలో మసులుతున్న శ్రీ హరిని తీసుకొని నందుడు యశోద గోప ప్రముఖులు వ్రేపల్లె వదిలి, బృందావనం వెళ్ళిపోయారు.

# బృందావనంలో

యమునా తీరాన బృందావనం ఉంది. అది చాలా అందమైన ప్రదేశం. యమునానది వద్ద గల ఇసుక తిన్నెలు వెండిరంగులో మెరుస్తుంటాయి. అక్కడి పూలవనాలు, సెలయేళ్ళు చిన్న చిన్న కొండలు బాలకృష్ణుని విహార భూములయాయి. అక్కడ గోపీగోపకులు బలరామ, కృష్ణులకు చక్కటి స్నేహితు లయ్యారు.

ఒకసారి వారందరూ అక్కడ ఆటపాటలలో వుండగా ఒక అందమైన దూడ అటుగా వచ్చింది. గొల్లపిల్లలు దానితో ఆడసాగారు,

ఇంతలో కృష్ణుడు అటువైపు వచ్చాడు. ఆ దూడ మామూలు దూడకాదని, అది రాక్షసుడని అతడు కనిపెట్టాడు. వెంటనే ఒక్కదూకు దూకి ఆదూడ కాళ్ళు పట్టుకొని గిరగిరతిప్పి నేలకు వేసి బాది చంపాడు. ప్రాణాలు విడుస్తున్న



వత్సాసుర సంహారం

సమయంలో ఆదూడ పెద్దరాక్షసుడిగా మారి పోయింది. ఆరాక్షసుడి పేరు వత్సాసురుడు. కంసుని స్నేహితుడు కృష్ణుని చంపాలని వచ్చి తానేచనిపోయాడు.

బృందావనంలో అందరు వింతగా చెప్పుకొన్నారు. నందుడు యశోద ఆనందించారు. కాని వ్రేపల్లెలో వలెనే బృందావనానికికూడా కృష్ణుని శత్రువులు ప్రవేసిస్తున్నారని ఆలోచించి వారు బాధపడ్డారు.

## మరో ఇద్దరికి శాస్తి

కొంతకాలం గడిచింది. కృష్ణుడు బలరామాదులు వెంట రాగా బృందావనంలోని ఒక సెలయేటి వద్ద ఆటలాడుకొంటున్నాడు. ఇంతలో అక్కడకు



బకాసురుడి వధ

పెద్దకొంగ వచ్చి వాలింది. దానికి పొడవైన కాళ్ళున్నాయి. కొన తేలిన ముక్కుంది. పెద్ద నోరుంది. హోరుగాలి వీచ గల రెక్కలున్నాయి.

అది అదను చూసి కృష్ణునిపై దూకింది, అతన్ని గటుక్కున మింగింది. కాని కృష్ణుడు దాని గొంతుకున అడ్డుపడ్డాడు అది విలవిల లాడింది. గాలిఆడక పోవడంతో కృష్ణుణ్ని బయటకు కక్కింది. కృష్ణుడప్పుడు ఆ కొంగ నోటిని పట్టుకొని రెండుగా చీల్చాడు అది నెత్తురు కక్కుకొంటూ చచ్చిపోయి రాక్షసుడుగా మారింది. వాడి పేరు బకాసురుడు. వీడుకూడా కంసుని శిష్యుడే కృష్ణుణ్ని తిన బోయి అతడి చేతిలో చచ్చాడు.



అఘాసురుని అంతం

అలాగే మరొకసారి బకాసురుని తమ్ముడు అఘాసురుడు కొండ చిలువ రూపంలో వచ్చాడు. గోపకుల్ని మ్రింగాడు. కృష్ణుణ్ని కూడా మ్రింగాడు అయితే కృష్ణుడు చాకచక్యంగా దానికి ఊపిరి ఆడకుండా చేసి చంపాడు. ఆ తర్వాత దాని పొట్ట చీల్చాడు. గోపకులందరూ బ్రతికి బయట పడ్డారు. ఇలా బకాసురుడు అఘాసురుడు అనే యిద్దరు ముష్కరులకు కృష్ణుడు శాస్తి చేయడమే కాక వారిని చంపాడు. అప్పటికి బాలకృష్ణుని వయసు ఐదేళ్ళు.

# కాళీయ మర్ధనం

బృందావనంలో ఒకచోట కాళింది అనే సరస్సు ఉంది. అందులో కాళీయుడు అనే దానవరాజు తన భార్యలతో కాపురం ఉంటున్నాడు. అతడు వెళ్ళక్కిన విషం వలన ఆ నీరు విషపూరితం అయింది. దానిని ఎవరు తాగినా మరణిస్తారు. అలా యెన్ని పశువులు మనుష్యులు ఆ నీరు విధిలేక త్రాగి చని పోయారు.

ఒకనాడు కృష్ణుడు స్నేహితులూ ఆ సరస్సు దగ్గర ఆటలకు వెళ్ళాడు. అందరూ బాగా అలసి పోయేలా ఆడారు. చివరకు గోపకులు కాళింది మడుగులో దిగారు. స్నానాలు చేసారు. ఆ నీటిని త్రాగారు. మరుక్షణంలో చచ్చి పోయారు.

ఈ విపరీతం చూసిన కృష్ణుడు కోపగించి తానుకూడా మడుగులోకి దూకి కాళీయుని పడగలపై తాండవం చేశాడు. అతడి భార్యలు శరణు వేడారు. వానిపై కృష్ణుడు శాంతించి యిలా అన్నాడు.

"మానవులు, పశువులు సంచరించే ఈ ప్రాంతం నుంచి వెళ్ళిపొండి ఈ సరస్సును యిక నుంచి అమృత జలాలు ప్రసరిస్తాయి."

కృష్ణుని ఆజ్ఞనుసారంకాళీయుడు భార్యలతో అక్కడనుంచి వెళ్ళిపోయాడు. నాటినుంచి కాళింది మడుగు అమృత జలాలతో ప్రవహించింది. కృష్ణుని మహిమను అందరు కీర్తించారు.

## మునికాంతల ముచ్చట

బృందావన సమీపంలోనే మునిపల్లెలున్నాయి. వాటికి, బృందవనానికి మధ్య అడవి ఉంది. కృష్ణుడు ఒకసారి ఆ అడవిలో ఆడుకొందుకు స్నేహితులతో వచ్చాడు. అందరు ఆడుకొన్నారు. వారందరికి బాగా ఆకలి వేసింది. అప్పుడు కృష్ణుడు కొందరు గోపబాలుర్ని దగ్గరలోని ముని ఆశ్రమాలకు వెళ్ళి వారి నడిగి తినడానికి తీసుకురమ్మని పంపాడు.

ఆ బాలకులు వెళ్ళి మునుల్ని ఆహారం యిమ్మని అడిగారు. వారు మునివీరగురువైన కృష్ణుడి మాటల్ని లక్ష్యపెట్టలేదు. ఏమీ యివ్వలేదు. విచారంగా తిరిగి వచ్చిన గోపబాలురతో కృష్ణుడు యిలా అన్నాడు.

"మీరు వెళ్ళి నామాటను చెప్పి మునికాంతల నడిగి ఆహారం తీసుకొని రండి."

కృష్ణుని సలహా ప్రకారం గోపపిల్లలు మునిపల్లెకు మరల వెళ్ళారు. రహస్యంగా యిళ్ళలో జొరపడ్డారు. మునికాంతలకు కృష్ణుని సందేశం వినిపించారు.

వారు ఆప్యాయంగా పిండివంటలు, ఫూరగాయలు, భోజనఫలహారాలు తీసుకొని శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చారు. అతనితోబాటు అందరికీ విందు చేశారు. బాల గోపాలుని మాటలు విని మురిసిపోయారు. శ్రీహరి మనుష్యావతారం యెత్తి లోకోద్ధరణకు ఉపక్రమిస్తున్నాడని తెలిసి, మునికాంతలు దేవదేవునకు ప్రణమిల్లారు.

## ఇంద్రుని ఆగ్రహం

యాదవుల కులదైవం ఇంద్రుడు, అతడు వర్షాధిపతి, పశుపోషణ, వ్యవసాయం జీవనోపాదిగా ఉన్న యాదవులు యింద్రుడ్ని ఆరాధిస్తారు. తమ ఆరాధనకు సంతోషించి, యింద్రుడు సకాలంలో వర్షం కురిపించి, పాడిపంటలు వృద్ధికావడానికి సహకరిస్తాడని వారి ఆశ. అందుకే ప్రతియేట ఇంద్రయాగం పేరిట ఇంద్రుని పూజించే ఆచారం వచ్చింది. ఆ యేడాది కూడా ఇంద్రయాగం చేద్దామని గోపకులు అనగా కృష్ణుడు యిలా అన్నాడు.

"పాలనిచ్చేవి పశువులు వాటిని ఆరాధించండి. పంటనిచ్చేది భూదేవి. ఆ తల్లిని కొలవండి. కొండవల్ల శీతల వాయువులు యేర్పడి మబ్బులువర్షిస్తాయి కనుక కొండని పూజించండి. వర్షఋతువులో వాన కురిపించడం ఇంద్రుని బాధ్యత. ఈ సారి మీరు ఇంద్రయాగం చేయవద్దు. ఈ ప్రకృతి మాతనే సేవించండి."

కృష్ణుని మాటలకు అందరూ ఆమోదించారు. అతడు చెప్పిన ప్రకారం కొండకు, పశుసంతతికి, ప్రకృతికి పూజచేసి సమారాధనం చేశారు.

యిది తెలిసి యింద్రుడు కోపగించాడు. వెంటనే రాళ్ళ వాన కురిపించాడు. గోకులం కళావికలమయింది. వెనువెంటనే ప్రళయ సదృశంగా పెను వాన కురిపించాడు. గోపాలురు తల్లడిల్లారు. బృందావనం గగ్గోలు ఎత్తింది. అందరు కృష్ణుణ్ని ప్రార్థించారు. అప్పుడు నందనందనుడు వారికి ఉపాయం చెప్పాడు.



గోవర్ధనగిరివద్ద గోపబాలురు

"మీరంతా గోవర్ధన పర్వతం దగ్గరకు పదండి నేను ఆ పర్వతాన్ని యెత్తి మీకు యీ పెనువృష్టినుంచి రక్షణ కల్పిస్తాను"

కృష్ణుని మాటపై విలువ ఉంచి గోపాలురు తమ గోగణాలతో గోవర్థనగిరిని చేరారు. కృష్ణుడు ఆ పర్వతాన్ని చిటికెన వ్రేలితో పైకెత్తాడు. దానిక్రింద గోపాలురు వారిసంసారాలు, పశుసంతతి రక్షణ పొందారు.

అయినా యింద్రుడు శాంతించలేదు. ఏడుపగళ్ళు ఏడురాత్రులు శిలా వర్షం, జలవృష్టి సాగిస్తూనే ఉన్నాట్ట్నా కృష్ణుడు గోవర్థనున గిరిని యెత్తే ఉంచాడు. వర్షదేవత తన శక్తియుక్తులు ఉడిగి పోవడంతో శాంతించింది. రాళ్ళ వాన నిలిచిపోయింది.

కృష్ణుడు గోవర్థన పర్వతాన్ని క్రిందకు దింపుతుండగా గోపాలురు బయటకు వచ్చారు. ఆర్తత్రాణపరాయణుడయిన కృష్ణుని అనేక విధాలుగా కీర్తించారు.

యింద్రుడు సిగ్గుపడి, వచ్చి కృష్ణుని అభినందించాడు. ఐరావతంచేత తామరపూల పూజ చేయించాడు. కామధేనువు యిచ్చిన పాలతో ఆయనను సేవించాడు. కృష్ణుడు అవతారపురుషుడని భావించి, నమస్కరించి, దేవలోకానికి వెళ్ళిపోయాడు. ఈ కథ సమస్తవిఘ్నాలు రూపుమాపి, అభీష్టాలు నెరవేరుస్తుందని అంటారు.

## వేణు గానం

కృష్ణుడు మురళి చక్కగా వాయించేవాడు. అతడి వేనుగానానికి ఈ ప్రకృతి పులకించేది. పశువులు తన్మయమై వినేవి ఆవులు క్షీరధారలు స్రవించేవి. కొండలు గొంతెత్తి ఆ ధ్వనిని మరల ప్రతిధ్వనించేవి. సర్పాలు చేష్టలుడిగేవి.

పూలు వికసించేవి. మొక్కలు వింతకాంతులు వెదజల్లేవి. నదులు సంగీత ధ్వనులతో ప్రవహించేవి.



వేణుగానంలో వేదసారం

ఇక బృందావనంలోని గోపికలు కృష్ణుని వేణుగానం విని సర్వం మరిచి పోయేవారు ఇళ్ళు వదిలి వచ్చేవారు. సంసారబంధాలు త్రెంచుకొని ఆ వేణుగానలోలునితో ఆటలాడేవారు, పాటలు పాడేవారు. అదంతాసృష్టివైచిత్ర్యం

అనంతా ప్రకృతి పులకింత అదంతా ప్రకృతీ పురుషుల రాసక్రీడ. అదే విచిత్ర దైవలీల.

ఈ ప్రపంచం. ఈ జీవరాశి. ఈ విశాల విశ్వం అంతా కృష్ణమయం అంతా దేవమాయం అని చాటి చెప్పిన సామగాన రసమది. అంతా కృష్ణమయం

ఇలా బృందావనంలో రాసలీలలు ప్రదర్శించిన కృష్ణుడు ఒకసారి గోపాలుర్ని తనను చంపాలని వచ్చిన శంఖచూడుడు అనే రాక్షసుణ్ణి చంపాడు అలాగే వృషభాసురుడ్ని చంపాడు.

దుష్టుల్ని శిక్షిస్తూ, శిష్టుల్ని రక్షిస్తూ కృష్ణుడు యిలా చిన్ననాడే తన అవతారవైభవాన్ని ప్రదర్శించసాగాడు. కాలం గడుస్తోంది.

## కంసుని పన్నాగం

బాలకృష్ణుని పరాక్రమ లీలలు, తాను నియమించిన రాక్షసుల చావులు కంసునిలో ప్రాణ భయాన్ని, అంతకుమించి బలరామకృష్ణుల పట్ల కోపాన్ని పగను రగిల్చాయి. వారిని యెలాగైనా చంపాలని ఉపాయం ఆలోచించాడు పన్నాగం పన్నాడు.

మథురానగరంలో ధనుర్యాగం చేయనున్నట్లు ప్రకటించాడు. పరాక్రమాలు ప్రదర్శించే అందరికి మథురానగరంలో పోటీలుంటాయి. ఎవరైనా పాల్గొనవచ్చు.

బృందావనానికి మాత్రం అక్రూరుణ్ని రాయబారిగా పంపాడు. బల రామకృష్ణుల్ని ఆహ్వానించమని చెప్పాడు. అక్రూరుడు బృందావనానికి వెళ్ళాడు

బలరామకృష్ణుల్ని చూశాడు. వారు సాక్షాత్తూ శ్రీహరి అవతారం అని గుర్తించాడు. సాగిలపడి నమస్కరించాడు. పురషసూక్తంతో స్తుతించాడు. తను వచ్చిన పని వారికి చెప్పాడు.

మధురానగరం వచ్చి శిష్టరక్షణ దుష్టశిక్షణ చేయమని అక్రూరుని సందేశం విన్నారు. బలరాముడుకృష్ణులు ధనుర్యాగానికి వస్తామన్నారు. అక్రూరుడు మధురకు వెళ్ళిపోయాడు.

## ధనుర్యాగం

రాచవంశాల వీరులు తమ పరాక్రమాన్ని యుద్ధవిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శించడానికి "ధనుర్యాగం" వంటి ఉత్సవాలు నిర్వహించడం ఆనాడు పరిపాటి. దీనివల్ల రెండు ప్రయోజనాలున్నాయి. యువకులలో యుద్ధవిద్యలపట్ల పోటీని పెంపొందించడం మొదటి ప్రయోజనం కాగా తమ శత్రువుల్ని పరోక్షంగా చంపించడానికి ఒక వేదికగా యిది ఉపకరిస్తుంది. ఇది రెండవ ప్రయోజనం. బలరామకృష్ణుల్ని చంపాలన్న దురుద్దేశ్యంతోనే కంసుడు యీ ధనుర్యాగం తలపెట్టాడు.

దేశదేశాల వీరులతో మధురానగరం కలకలలాడుతోంది. బలరామకృష్ణులు రాచవీధులు తిరుగుతున్నారు. దారిలో వారికి ఒక చాకలి కనిపించాడు. వాడి దగ్గర మంచి రాచదుస్తులున్నాయి. కృష్ణుడు వాడ్ని పిలిచి తమకు మంచి

బట్టలు యిమ్మన్నాడు. అప్పుడు ఆ చాకలి వారిని వేళాకోళంచేసి "అల్లరిపనుల్లు దొంగవేషాలు వేసే గోపాలకులకు రాచదుస్తులా" అని పకపక నవ్వాడు. వాడి మాటలు విని అక్కడి జనం కూడా బలరామకృష్ణుల్ని చూసి వేళాకోళంగా నవ్వి అవమాన పరిచారు.

అప్పుడు కృష్ణుడు ఆ చాకలిపైకి లంఘించి, బలంగా కొట్టి చంపాడు. వాడు నిజం చాకలి కాదు. బలరామకృష్ణుల్ని పరాభవించి, చంపాలని వచ్చిన రాక్షసుడు. అయితే ఆట సాగలేదు సరికదా ఆయువు మూడి చచ్చిపోయాడు. వాడి వెంటఉన్న చాకళ్ళుమాత్రం ఆ బాలలిద్దరికీ నమస్కరించి వారికి పట్టు ధట్టీలు చీనాచీనాంబరాలు కానుకగా యిచ్చి వెళ్ళారు.

# నిన్న కుబ్జ-నేడు సుందరి

బలరామకృష్ణులు నగరం తిరుగుతూ మరొక వీధి లోనికి వచ్చారు. అది పూలబజారు. అక్కడ మూడు వంకరలు తిరిగిన శరీరంతో అందవికారంగా ఉన్న కుబ్జ అనే యువతి రకరకాల పూలను విక్రయిస్తున్నది. ఆ యువతి పూల మాలలు కట్టడంలో చాలా నేర్పరి. ముడుచుకొనే దండలు, విచ్చుకొనే దండలు, ఆకారాలు మార్చుకొనే మాలలు ఇలా ఆమె అనేక రకాల దండలు కట్టగలదు. పూలనుఅందంగా అమర్చగలదు పైగా పునుగు, జవ్వాది వంటి పరిమళద్రవ్యాలు కూడా అమ్ముకుంటుంది.

ఆమె బలరామకృష్ణులకు చక్కటి మాలలు యిచ్చింది. పూలు యిచ్చింది. పునుగు జవ్వాది పులిమింది. వారిని ఆప్యాయంగా చూసింది. ఆమె భక్తికి మెచ్చి కృష్ణుడు ఆమె శరీరాన్ని నిమిరాడు అంత వరకు కుబ్జరూపంలో



కుబ్జపై కృపాదృష్టి

అందవికారంగా ఉన్న ఆమె కృష్ణ స్పర్శతో అందమైన యువతిగా మారింది. పరమేశ్వరుని కృపవల్ల నిన్నటి కుబ్జ నేటి సుందరి అయింది.

# కువలయాపీడం

ఆ అన్నదమ్ము లిద్దరు రాచవీధులు నడిచి, నడిచి, రాచసౌధం దగ్గరకు చేరారు. అక్కడే ధనుర్యాగం జరుగుతున్నది. వారు లోపలకు వెళ్ళిపోయారు. అయితే సింహద్వారం దగ్గర వారిపైకి ఏనుగు ఒకటి దూకింది, దాని పేరు కువలయాపీడం. అది చాలా బలమైనది. పొగరు గలది. అది బలరామ కృష్ణుల్ని తొండంతో పట్టుకొని తామరకాడలను వలె నేలకు వేసికొట్టి చంపాలని ప్రయత్నించిది. కాని వారిద్దరు ఎంతో నేర్పుగా తప్పించుకొని దాని కుంభస్థలం పైకి యెక్కారు.

ఇద్దరు అటుయిటు చేరి, దాని కుంభస్థలాన్ని బలంగా మర్దించి, చంపారు. ఆ మదపుటేనుగు హాహాకారం చేస్తూ. నెత్తురు కారుస్తూ నేలకూలి ప్రాణాలు విడిచింది. ఆ ఏనుగుదంతాలను కోసి బలరామకృష్ణులు భుజాన వేసుకొని రాజభవన ప్రాంగణంలో ప్రవేశించారు.

# మల్లయుద్ధం

అక్కడ మల్లయుద్ధం జరుగుతుంది. ఎందరో మల్లయుద్ధ వీరులు దానిలో పాల్గొంటున్నారు. వారందరినీ కంసుని ఆస్థాన మల్లయోధులు చాణుక్య ముష్టికులు ఓడించారు. అప్పుడు బలరామకృష్ణులు వారిపైకి దూకారు. చిత్ర విచిత్రగతులలో వారు నలుగురు ముష్టియుద్ధం చేస్తున్నారు.

పర్వతంపై పిడుగులవలె, ఏనుగుల కుంభస్థలాలపై వజ్రఘాతం వలె, రాతిస్తంభాలపై కుంభవృష్టి వలె చాణుర ముష్టికులను బలరామకృష్ణులు బాధించారు. చివరకు ఆ మల్లయోధులిద్దరు శక్తి సన్నగిల్లి వారిచేతులలో మరణించారు.



చాణూరునితో మల్లయుద్ధం

ఎందరో మల్లయోధుల్ని అవలీలగా చంపిన చాణుర ముష్టికుల్ని చంపిన బలరామకృష్ణుల్ని చూసి ప్రజలు జయజయధ్వానాలు చేశారు. దుష్టులైన ఆ యిద్దరి మృతికి వారానందించారు.

# కంసవధ

బలరామకృష్ణ విజయగాథ విన్న కంసుడు మండిపడ్డాడు. వార్ని కోపంతో విరుచుకొని పడ్డాడు. వసుదేవుణ్ని ఉగ్రసేనుణ్ని నందాదుల్ని చిత్ర హింసలు పెట్టమని భటులకు ఆజ్ఞలు జారి చేసాడు. వారు వెళ్ళబోయారు. అయితే బలరాముడు విజృంభించి వారిని అడ్డగించాడు.



కంస వధ

కంసుడిని ఉపేక్షించి లాభంలేదని కృష్ణుడు అతడి పైకి లంఘించాడు. ఇద్దరు హోరాహోరి పోరాడారు. కృష్ణుడు కంసుణ్ణి సంహరించాడు. ఈ ఘోర

చూసిన కంసుని సోదరులు అతడిపై విరుచుకు పడ్డారు. కృష్ణుడు వారిని కూడా చంపాడు.



తలిదండ్రులకు విముక్తి

కంసుని చెరలో ఉన్న తల్లితండ్రులు దేవకీ వసుదేవుల్ని, తాత ఉగ్రసేనుణ్ని యింకా ఎందరో రాజుల్ని విడిపించాడు. బలరామకృష్ణుల విజయ గాథను కిన్నర, కింపురుషాదులు కీర్తించారు. కంసుడి మరణంతో దేవత లానందించారు. భూమండలంపై పుష్పవృష్టి కురిసింది.

# సాందీపని

ఆ కాలంలో ఉజ్జయినిలో సాందీపని అనే మహర్షి ఉండేవాడు. ఆయన ఉత్తమగురువు. ఎందరో శిష్యుల్ని తయారుచేసిన కులపతి. ఆయన దగ్గర బలరామకృష్ణులు ఆశ్రమవాసం చేసి సకల విద్యారహస్యాలు నేర్చారు.



సాందీపని విద్యాశిక్ష

వేదాంతం తెలుసుకొన్నారు. రాజనీతిని అభ్యసించారు. దర్శనశాస్త్రాలు వల్లె వేశారు. ఆ ఉత్తమ గురువు దగ్గర ఉత్తమశిష్యులుగా రూపొందారు.

ఒకనాడు ఆయనకు గురుదక్షిణ యిస్తామన్నారు. తన కుమారుడు సముద్రంలో పడి చనిపోయాడని, అతడిని తీసుకువచ్చి యిమ్మని సాందీపని కోరాడు.

గురువు అభీష్టాన్ని అనుసరించి బలరామకృష్ణులు సముద్రం అంతా గాలించారు. ఆ బాలుడు యమలోకంలో ఉన్నాడని వారికి చివరకు తెలిసింది. వారిద్దరు యమధర్మరాజు దగ్గరకు వెళ్ళారు. సంగతిని వివరించారు. యమధర్మ రాజు ఆ బాలుడిని వారికి అప్పగించి, సాదరంగా పంపించాడు. బలరామకృష్ణులు భూలోకానికి వచ్చి, గురుదక్షిణ చెల్లించి, ఆయన ఆశీస్సులు పొంది మధురా నగరానికి తిరిగి వచ్చారు.

## జరాసంధ పరాభవం

ఆ రోజులలో మగధ దేశాన్ని జరాసంధుడు పరిపాలిస్తున్నాడు. కంసుడు అతడికి అల్లుడు అవుతాడు. కృష్ణుడు తన అల్లుణ్ణి చంపాడన్న కోపంతో జరాసంధుడు దండెత్తి వచ్చాడు. ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో జరాసంధుడు విరుచుకు పడగా బలరాముడు అడ్డుకొన్నాడు. తన నాగలితో శత్రు సైన్యాల్ని వధించాడు. రోకలితో మర్దించాడు. ఆ సేనలు పలాయన చిత్తగించాయి.

బలరాముడు విజృంభించి జరాసంధుని రథాన్ని విరగ గొట్టి అతడిని పట్టుకొని బంధించాడు. అతన్ని చంపాలనుకొన్నాడు. కాని "జరాసంధు అప్పుడే చంపవలదని" కృష్ణుడు చెప్పగా బలరాముడు అతడ్ని వదిలిపెట్టాడు. పరాభవంతో జరాసంధుడు. మగధకు వెళ్ళిపోయాడు జరాసంధ పరాభవ వా మధురానగర ప్రజల్ని ఆనంద పరవశుల్ని చేసింది.

ఆతర్వాత రైవతుడనే రాజు తన కుమార్తె రేవతిని బలరాముడు యిచ్చి వివాహం చేశాడు. బలరామ వివాహ కథ సకల శ్రేయోదాయకం పెద్దల మాట.

## రుక్మిణీ కళ్యాణం

విదర్భ దేశాధిపతి భీష్మక మహారాజు. ఆయనకు రుక్మి రుక్మరథ, రుక్మబాహూ, రుక్మకేశి, రుక్మమాల, అనే అయిదుగురు కొడుకులు రుక్మిణి అ కూతురు ఉన్నారు.

రుక్మిణి సౌందర్యవంతురాలు సుగుణశీలి. ఆమె కృష్ణుని బల పరాక్రమాలు, గుణగణాలు విని, అతడిని ప్రేమించింది. ఆమెకు యుక్త వయ వచ్చింది. తండ్రి వివాహ ప్రయత్నాలు ప్రారంభించాడు. ఆమె అన్న రుక్మి ఆమెను తన స్నేహితుడైన శిశుపాలునకు యిచ్చి వివాహం చేయాలని శిశుపాలుని పట్ల రుక్మిణికి ఆసక్తి లేదు.

అందుకని ఆమె తమ కుల బ్రాహ్మణుడయిన అగ్నిద్యోతనుని ద్వారా కృష్ణునికి రాయబారం పంపింది.

వివాహానికి ముందు గౌరీ పూజకై నగరం పొలిమేరలలోని దేవి ఆలయానికి వస్తానని, అక్కడ నుంచి తనను తీసుకొని వెళ్ళి రాక్షసపద్ధతిన



రుక్మిణీ హరణం

వివాహంచేసుకొనమని రుక్మిణి పంపిన సందేశాన్ని ఆ విప్రుడు కృష్ణునకు విని పించాడు. కృష్ణుడు అభయం యిచ్చాడు.

పెళ్ళిరోజు రానే వచ్చింది. విదర్భరాచనగరం కల కరాలాడుతోంది. శిశుపాలాదులు తరలి వచ్చారు. కృష్ణుని జాడ మాత్రం కానరాలేదు.

అయినా రుక్మిణి అధైర్య పడక మనస్సులో కృష్ణునే ధ్యానిస్తూ గుడికి బయలుదేరి వెళ్ళింది. కలడ గౌరీపూజ పూర్తిచేసింది. తిరిగి వస్తుండగా మార్గంలో కృష్ణుడు రథంపై వచ్చి ఆమెను రథం ఎక్కించుకొని తీసుకు వెళ్ళాడు.

ఈ వార్త తెలిసిన రుక్మిణి మండిపడ్డాడు శిశుపాలుడు వెంటరాగా కృష్ణుణ్ని అడ్డగించి పోరాడాడు. కృష్ణుడు వారందరినీ ఓడించి, అవమానించి పంపాడు.

ద్వారక చేరి రుక్మిణిని విధ్యుక్తంగా వివాహం చేసుకొన్నాడు. వారికి ప్రద్యుమ్నుడు అనే కుమారుడు జన్మించాడు. రుక్మిణీ పరిణయగాథ ఇష్ట వాంఛా ఫలాన్ని యిస్తుందంటారు.

## సత్యభామ

ద్వారకలో ఉన్న సత్రాజిత్తు అనే రాజు పరిపాలించేవాడు. ఆయన కుమార్తె సత్యభామ. అపురూప సౌందర్యవతి. నెరజాణ. సత్రాజిత్తు సూర్యుణ్ని ఆరాధించి శ్యమంతక మణిని సంపాదించాడు. అది రోజు నూరు బారువుల బంగారం యిస్తుంది.

ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు ఆ మణి ధరించి వేటకు వెళ్ళాడు. అతడిని సింహం చంపింది. అయితే మణిని మాత్రం జాంబవంతుడు తీసుకొని వెళ్ళిపోయి తన కుమార్తె జాంబవతికి బహూకరించాడు.



జాంబవంతుడితో కృష్ణుని యుద్ధం

అంతకు ముందు ఒకసారి కృష్ణుడు ఆ మణిని తనకిమ్మని సత్రాజిత్తును అడిగాడు. ఆయన యివ్వలేదు. అయితే యిప్పుడు ఆ మణిని కృష్ణుడే అపహరించాడని సత్రాజిత్తు నింద వేశాడు.

ఆ నింద మాపుకొనాలని కృష్ణుడు బయలుదేరాడు. ప్రసేనజిత్తుని సింహం చంపిన చోటునుంచి అడుగు జాడలు గుర్తించి జాంబవంతుని గుహ చేరాడు. అక్కడ జాంబవతి దగ్గర శ్యమంతకమణి కనిపించింది, తీసుకొన బోయాడు.

ఇంతలో జాంబవంతుడు వచ్చి కృష్ణునిపై పడ్డాడు. ఇద్దరు భయంకరంగా యుద్ధం చేశారు. చివరకు జాంబవంతుడు ఓడిపోయాడు. కృష్ణుడు శ్రీమహావిష్ణువు అవతారం అని గుర్తించి జాంబవంతుడు అతడికి నమస్కరించి, తన కుమార్తెను జాంబవతిని యిచ్చి పెళ్ళి చేశాడు. శ్యమంతకమణిని కానుకగా యిచ్చాడు.

కృష్ణుడు శ్యమంతక మణిని సత్రాజిత్తుకు యిచ్చి తన నింద మాపుకొన్నాడు. సత్రాజిత్తు తన తొందరపాటుకు చింతించి, సత్యభామను యిచ్చి కృష్ణునితో వివాహం చేశాడు. శ్యమంతకమణిని ఆ నూతన దంపతులకు బహూకరించాడు.

# నరకాసుర సంహారం

నరకాసురుడు ప్రాగ్జ్యోతిషపుర ప్రభువు అతడికే భౌమాసురుడు అనే పేరుంది. ఈ నగరం అటు బ్రహ్మదేశానికి ఇటు హస్తినాపురానికి మధ్యన ఉంది. ప్రస్తుతం అస్సాం అని మనం పిలుస్తున్న ప్రాంతం ఆనాడు ఆపేరుతో

పిలవబడేది. నరకాసురుడు, అటు సత్రాజిత్తుకు, ఇటు పాండవులకు, కృష్ణునకు విరోధి పైగా రాక్షసుడు.



నరకాసుర సంహారం

అపడి దుష్కృత్యాలకు అంతేలేదు. ఎందరినో అతడు దారుణంగా చంపాడు. పదహారు వేలమంది రాచకన్యలను కారాగారంలో బంధించాడు. వారందరు కృష్ణుని ధ్యానిస్తు తమకు విముక్తి కలిగించమని తపస్సు చేస్తున్నారు.

ఒకసారి కృష్ణుడు, సత్యభామతో కలిసి నరకునిపై దండెత్తాడు. భయంకరంగా యుద్ధం జరిగింది. కృష్ణుడు మూర్ఛ బోయాడు. అప్పుడు కొంత సేపు సత్యభామ యుద్ధం చేసింది. ఇంతలో కృష్ణునకు స్పృహ వచ్చింది. చక్రం ప్రయోగించి నరకుడి శిరస్సు ఖండించాడు.

లోకం హర్షించింది. పదహారువేల మంది రాచకన్యలను కృష్ణుడు చెర విడిపించాడు. వారి కోరిక మేరకు వారందరినీ ఆయన వివాహం చేసుకొన్నాడు. కృష్ణునకు ఎనిమిది మంది పట్టమహిషులు, పదహారువేల మంది రాణులు ఉండేవారు. నరకాసుర సంహార గాథ సకల విఘ్నవినాశకరం అని పెద్దల మాట.

## ఉష - అనిరుద్ధుడు

బలిచక్రవర్తికి నూరుగురు కొడుకులు వారిలో పెద్దవాడు బాణాసురుడు అతడు పరమశివభక్తుడు. పైగా మహాబలవంతుడు. భుజపరాక్రమశాలి. తన బాహుబలంపై ఎంతో గర్వం ఉన్నవాడు.అతని కుమార్తె ఉష.

ఆమె కృష్ణ నందనుడైన అనిరుద్ధుణ్ని కలలో చూసి ప్రేమించింది. తన చెలికత్తె ద్వారా అతడి వివరాలు తెలుసుకొంది. ఆ అందగాడినే వివాహం చేసుకొనాలని నిర్ణయించుకొంది. చెలికత్తెను పంపి నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ని మాయం చేసి తీసుకొని రమ్మంది. ఆ చెలికత్తె అలాగే చేసింది.

ఉష అనిరుద్ధులు ప్రేమ సామ్రాజ్యంలో విహరించారు. ఉష గర్భవతి అయింది. ఇది తెలిసిన బాణాసురుడు మండి పడ్డాడు. అనిరుద్ధుణ్ని నాగపాశంతో బంధించాడు. దీనితో ఉషా కన్య శోకించింది.

ఎన్నాళ్ళకు అనిరుద్ధుని జాడ తెలియక పోవడంతో కృష్ణాదులు కంగారు పడ్డారు. నారదుడు వారికి అనిరుద్ధుడు బందీ అయిన సంగతి చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు యాదవసైన్యంతో బాణాసురునిపై దండెత్తాడు. యుద్ధం భయంకరంగా జరిగింది. బాణాసురునికి పరమశివుడు సాయం వచ్చి నిలిచాడు. అయినా లక్ష్యపెట్టక కృష్ణుడు సుదర్శనం ప్రయోగించాడు. అది అగ్నిజ్వాలలు వెదజల్లుతూ బాణాసురుడి వేయిచేతుల్ని ఖండించింది. బాణాసురుడు నిర్వీర్యుడయాడు. అప్పుడు ఈశ్వరుడు తన భక్తుడైన బాణుణ్ణి విడవమని కృష్ణునికి నచ్చచెప్పాడు. కృష్ణుడు అనుగ్రహించాడు.

అతడు శివపార్షదుడై చిరకీర్తి పొందాడు. ఉషానిరుద్ధులకు వివాహం వైభవంగా జరిగింది. శంకర శ్రీకృష్ణులు ప్రమేయం పెట్టుకొన్న ఈగాథ అన్ని అభీష్టాలు నెరవేరుస్తుందని విజ్ఞుల వచనం.



# కృష్ణలీలా వైభవం

అనంతర కాలంలో శ్రీ కృష్ణుడు మధుర, ద్వారక, హస్తినాపుర రాజక్రియాలు నిర్వహించాడు ఎంతో రాజనీతి ప్రదర్శించాడు. ఎందరో దుష్టుల్ని సంహరించాడు పౌండ్రక కాశీరాజులకు ఉద్ధరించాడు. ద్వివిదునికి మోక్షం ప్రసాదించాడు. సాంబునికి వివాహం చేయించాడు. నారదునకు తన దివ్యలీలలు చూపాడు.

పాండవాగ్రజుడైన ధర్మరాజు చేత రాజసూయం చేయించాడు. ఆ సమయంలో జరాసంధుణ్ని వధింపజేసి, అతడికి బందీలైన ఎందరో రాజుల్ని విడిపించాడు. అనంతరం భీష్ముడి సలహాను అనుసరించి ధర్మరాజు తనకు అగ్రతాంబూలం యివ్వబోగా అడ్డగించిన శిశుపాలుణ్ని సంహరించాడు. శిశుపాలుని స్నేహితుడైన దంతవక్త్రుడు తనను ఎదిరించగా అతడిని కూడా చంపాడు.

తదుపరి రాయబారియై విశ్వరూపం ప్రదర్శించాడు. యుద్ధంలో అర్జున సారధియై పాండవులకు విజయం చేకూర్చాడు. కథలు, గాధలు అన్నీ మహా భాగవతంలో ఎంతో విపులంగా వర్ణితమైనాయి. అవన్నీ కృష్ణలీలా వైభవ కథలు.



## కుచేలుడు

ఉజ్జయినీ నగరంలో సాందీపని గురుకులంలో కృష్ణునితో బాటు ఒక బ్రాహ్మణ విద్యార్థి కూడా చదువుకొన్నాడు. అతని పేరు సుదాముడు. చిరిగిన వస్త్రాలు ధరించేవాడు కనుక అతడిని కుచేలుడు అని పిలిచేవారు.

అతడు చాలా పేదవాడు. పైగా గంపెడుసంసారం. ఒకనాడు భార్య సలహాను పురస్కరించుకొని శ్రీకృష్ణుని సహాయాన్ని కోరదామని వచ్చాడు. బాల్యస్నేహితుని చూసి ఎంతో సంతోషించి, మర్యాదలు చేశాడు. శ్రీకృష్ణ వైభవాన్ని చూసి కుచేలుడు ఆనంద పరవశుడయాడు. ఏమీ అడగ లేక పోయాడు. మరునాడు తెల్లవారుతూనే యింటికి వెళ్ళిపోయాడు.

అక్కడకు చేరే సరికి తన పర్ణశాలకు బదులు పెద్దమేడ ఉంది. అన్ని ఐశ్వర్యాలుకృష్ణుడు ప్రసాదించాడని కుచేలుడు ఆనందించాడు. మిత్రత్వానికి పేదధనిక భేదాలు లేవని ఈకథ మనకు నీతిని బోధిస్తుంది.

## మునుల శాపం

శ్రీకృష్ణుడు భారత యుద్ధం చేయించి, దుష్టులయిన రాజుల్ని చంపించాడు. దానితో భూభారం తగ్గింది. మంచివారికి కష్టకాలం పోయింది. కృష్ణుడు ద్వారకానగరం చేరాడు. అక్కడ యాదవ వంశస్థులు బలగర్వితులై సంచరించ

డం చూశాడు. వారివల్ల భవిష్యత్తులో లోకానికి, సజ్జనులకు అపకారం తప్పదని భావించాడు. వారి అహంకారాన్ని అణచాలని కృష్ణుడు సంకల్పించాడు. సమయం కోసం వేచి ఉన్నాడు.

ఆ సమయం రానే వచ్చింది. ఒకసారి వశిష్ఠ విశ్వామిత్ర దుర్వాస వామదేవాది మహర్షులు ద్వారకా నగరం వచ్చారు. వారికి ఉగ్రసేన మహారాజు సకలవిధ మర్యాదలు చేయించాడు.

నగరం పరిసరాలలోని ఉద్యాన వనంలో వారికి విడిది యేర్పాటు చేయించాడు. ఆ మునులందరూ అక్కడ బస చేసి అనేక రకాలయిన కాలవైపరీత్యాలు గురించి కాల ప్రభావం గురించి చర్చలు జరుపుతూ సద్గోష్టిలో నిమగ్నులైనారు.

బలంతో అధికారంతో గర్వితులైన యాదవులు కొందరు ఋషుల్ని పరిహసించాలని అనుకొన్నారు. సాంబునకు స్త్రీ వేషం వేయించారు. పైగా గర్భవతి అయినట్లు అలంకరించారు. ఋషుల వద్దకు తీసుకువచ్చారు. ఆ ఋషులు వారిని ఆశీర్వదించి సంగతేమిటని ప్రశ్నించారు. అప్పుడు వారిలా అన్నారు:

"మహర్షులారా! ఈ యువతి కిది తొలికాన్పు. ఆడపిల్ల పుడుతుందో మగ పిల్లవాడు పుడతాడో? మీ దివ్యదృష్టితో భవిష్యత్తును చెప్పండి."

వారి మాటలు విని ఋషులు దివ్యదృష్టితో చూశారు. సంగతి గ్రహించారు. పురుషునకు ఆడవేషం వేయించి తమను వారు పరిహసించారని ఋషులు గుర్తించారు. వారిపై ఆగ్రహించి యిలా శపించారు:

"ఓ! యాదవులారా! ధన బల గర్వంతో మీరు మునులనే అవమానించారు. గేలిచేశారు. ఈ సాంబుని గర్భాన ఒక ముసలం (రోకలి) పుడుతుంది అది మీ వంశాన్ని నాశనం చేస్తుంది."

ఋుల షుశాపం విని యాదవులు భయపడ్డారు. అంతలోనే ధైర్యం తెచ్చుకొన్నారు. వారు శస్త్ర చికిత్స చేయించి సాంబుని కడుపు కోయించారు. దానిలో నిజంగానే యినుప రోకలి కనిపించింది. ఋషుల శాపం వృధా పోలేదని వారు గ్రహించారు. ఆ రోకలి తమను నాశనం చేస్తుందని భయపడ్డారు.

అందరూ కలిసి దానిని ఉగ్రసేన మహారాజు దగ్గరకు తీసుకువెళ్ళి ఋషుల శాపం గురించి చెప్పారు. అప్పుడు ఆ మహారాజిలా అన్నాడు.

"యాదవులారా! పెద్దలను అవమానించడం ప్రాణాంతకమే. అయినను మనల్ని రక్షించు కోవాలి కనక యీ రోకలిని అరగదీయండి, అరజనును సముద్రంలో కలపండి."

ఉగ్రసేనుని ఆజ్ఞను అనుసరించి యాదవులు రోకలిని అరగదీసి రజనంతా సముద్రంలో కలిపారు. చిన్న ముక్క మిగిలితే అది తమనేం చేస్తుం దాని దానిని సముద్రంలో పారవేశారు. ఆ ఇనుపరజను నుంచి కాలక్రమంతో సాగరతీరాన ఇనుపతుంగ మొలిచింది. ఆ ఇనుపముక్కను చేప మ్రింగింది. ఆ చేపను జాలరి పట్టుకొన్నాడు. దానిని కోయగా ఇనుప ముక్క బయటపడింది అతడు దానిని బాణానికి ములుకుగా అమర్చుకొన్నాడు. వాడి పేరు జర.

కాలచక్రం గిరగిర తిరిగింది. యాదవులలో పరస్పరం కలహాలు పెరిగాయి. ఒకరంటే మరొకరికి పడకంలేదు. ఒకరినిచూసి మరొకరు ద్వేషించు

కొంటున్నారు. ఒకరిపై ఒకరు చాడీలు చెప్పుకొంటున్నారు. మనుష్యుల మధ్య కలహాలు ఇళ్ళమధ్యకు విస్తరించాయి. ఇంటింటి తగాదాలు వీధులకు యెక్కాయి వీధి-వీధి కయ్యాలు గ్రామం అంతా వ్యాపించాయి. గ్రామాలమధ్య వైరుధ్యాలు వంశాలమధ్య పాకాయి. ఇలా యాదవులు ఒకరిపై ఒకరు కత్తులు నూరుతున్నారు ఆ సమయంలో కృష్ణుడు యాదవప్రముఖుల్ని పిలిచి యిలా ఆదేశించాడు.

"యాదవశ్రేషులారా! ద్వారకా నగరానికి, గోకులానికి, యాదవ వంశానికి చెడుకాలం వచ్చింది. ఇక మీరు యిక్కడ ఉండడం శ్రేయస్కరం కాదు. అందరూ నావలపై సముద్రం దాటి ప్రభాసక్షేత్రం వెళ్ళండి. చోటు మారితే చిత్తశాంతి సమకూరుతుందేమో! అక్కడయినా మీరు సంఖ్యంగా, శాంతంగా జీవించండి."

శ్రీకృష్ణుని ఆదేశం విని యాదవ శ్రేష్టులు నావలపై సాగరం దాటి ప్రభాసక్షేత్రం చేరారు. అక్కడ వారు "మైరేయం" అనే మద్యం సేవించారు అది వారి బుద్ధిని హరించివేసింది. వారితో మరల కలతలు తలఎత్తాయి. అక్కడ విపరీతంగా పెరిగిన ఇనుప తుంగతో పరస్పరం కొట్టుకొని వారు మరణించారు యాదవ వృష్ణిదశార్ణ మొదలైన వంశాలు ఆ అంతఃకలహాలలో అంతరించి పోయాయి. మునుల శాపం వృధాపోలేదు. సాంబుని కడుపున జన్మించిన రోకలిని అరగదీయగా వచ్చిన రజను నుంచి పుట్టిన ఇనుపతుంగతో కొట్టుకొని యాదవులు నశించారు.

యాదవులు యిలా చనిపోవడంతో భూమి భారం ఇంకా తగ్గింది. అప్పుడు బలరాముడు అక్కడి ఒక చెట్టు క్రింద చేరి ఆత్మను పరమాత్మయందు లగ్నం చేశాడు. యోగమార్గాన ప్రాణాన్ని విడిచాడు.

బలరాముడు వైకుంఠం చేరగానే శ్రీకృష్ణుడు అక్కడి రావిచెట్టు క్రింద విశ్రమించాడు. అతడి అరికాళ్ళు ఎఱ్ఱతామర వలె ప్రకాశిస్తున్నాయి. కృష్ణుని శరీరం దివ్య తేజస్సుతో వెలుగొందుతోంది. అతడి వక్షఃస్థలంపై శ్రీవత్సం ప్రకాశిస్తోంది.

ఇంతలో అటుగా జర అనే పేరుగల వేటగాడు వచ్చాడు. అతడి దగ్గరే ముసలం ముక్క ములుకుగా తగిలించిన బాణం ఉంది. అతడు జంతువు వేటాడుతూ వచ్చాడు. అతడి బారినుంచి ఒక లేడి తప్పించుకొని అటుగా గెంతింది. దానిని వెదుకుతూ 'జర' కృష్ణుడు విశ్రమించిన చెట్టు వైపు వచ దూరంగా పొంచి పరికించి చూశాడు. అతడికి కృష్ణుని పాదం లేడిముట్టె కనిపించింది. వెంటనే గురిచూసి బాణం వదిలాడు. అది శ్రీకృష్ణుని కాలి నర వేధించింది. మరుక్షణంలో అక్కడ శ్రీకృష్ణుని రూపం మాయం అయి చతుర్భుజాలతో శ్రీమహావిష్ణుమూర్తి రూపం వెలిసింది.

వేటగాడు ఆదివ్యమంగళ స్వరూపాన్ని చూసి, వేగిరం దగ్గ వచ్చి శరణువేడాడు. అప్పుడు విష్ణుమూర్తి అతడికి అభయం యిచ్చి యిల అన్నాడు.

"నాయనా! భయపడకు. ఋషులశాపం ప్రకారం యాదవకులాన్ని ముసలం నాశనం చేసింది. నువ్వు బాణం ములుకుగా ఉపయోగించిన ఇనుప ముక్క కూడా ఆ ముసలంలో భాగమే. నువ్వు నిమిత్తమాత్రుడవు. నీకు



కృష్ణావతారం సమాప్తం

వైకుంఠం ప్రసాదిస్తున్నాను. నా అవతారం పరిసమాప్తం అయ్యింది. కృష్ణావతార రూపమైన ఈ "హరికథ"ను చదివినా, విన్నా, వ్రాసినా వారికి సకల విఘ్నాలు తొలగిపోయి సుఖాలు లాభాలు, సంప్రాప్తిస్తాయి."

ఈమాటలు అని శ్రీహరి వైకుంఠం చేరాడు. బోయవాడు శరీరంతో విష్ణు సాయుజ్యం పొందాడు.

ఇలా శ్రీకృష్ణుడు అనేక దివ్యలీలలు ప్రదర్శించి, లోకోపకారంచేసి, దుష్టత్వాన్ని అంతం చేసి, వైకుంఠం చేరాడు. ఈ అవతారంతోనే శిశుపాల, దంతవక్త్రుల్నిచంపి, జయవిజయులకు శాపవిమోచనం కలిగించాడు. దశమ, ఏకాదశస్కంధాల కథను యిలా సంగ్రహంగా చెప్పుకొన్నాం.

## యుగధర్మాలు

భాగవతం పన్నెండవ (ద్వాదశ)స్కంధంలో కలియుగ రాజవంశాలు, యుగధర్మాలు, కల్పాలు, ప్రళయాలు, పరీక్షిత్తు దేహత్యాగం, జనమేజయుని సర్పయాగం, వేదశాఖలవర్ణన మార్కండేయకథ, పురాణాల వివరం వర్ణితమైనాయి.

ఈ మహాకాలాన్ని నాలుగు యుగాలుగా విభజించారు. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం వాటి పేర్లు.

కృతయుగంలో ధర్మానికి సత్యం, దయ, తపస్సు, దానం అనేవి నాలుగు పాదాలు. ఈ యుగంలో మానవజాతి ఈ నాలుగు విశిష్టగుణాలతో విరాజిల్లుతుంది.

త్రేతాయుగంలో యించుమించు యీలక్షణాలే ఉంటాయి. కాని మానవులు ధర్మానికి బొరుసు వంటి దయిన అధర్మం గురించి కూడా ఆలోచన చేస్తుంటారు.

ద్వాపరయుగంలో అధర్మం యొక్క ప్రధాన లక్షణాలైన అసత్యం, హింస, అసంతోషం, అంకురిస్తాయి. ఇవే క్రమంగా పెరుగుతాయి.

కలియుగంలో పూర్తిగా ధర్మం క్షీణిస్తుంది. ఎక్కడ చూసినా అసత్యవాదు లుంటారు. హింసాప్రియులు విజృంభిస్తారు. అసంతుష్టి పెరుగుతుంది. కలహప్రియులకు కొదువ ఉండదు.

ఇలా కలియుగం నడిచి, నడిచి ప్రళయం వస్తుంది. అనంతరం మరల సత్య (కృత)యుగంవస్తుంది. ఇది చక్ర భ్రమణం ఇది కాల ధర్మం. ఈకాలనేమి క్రమానికి సాక్షీభూతుడు శ్రీమన్నారాయణమూర్తి.

ఆయన ప్రళయ సముద్రంపై వటపత్రశాయియై ఉంటాడు.

ఆ శిశువు నుంచి మాయారూపమైన ఈ సృష్టి మరల జరుగుతుంది. ఆ దివ్యరూపాన్నే మార్కండేయాదులు ఆరాధించారు.

## కల్కి

కలియుగంలో మానవులు అనేక రకాలయిన దుష్టబుద్ధులు కలిగి ఉంటారు. ఆచారాలు ఉండవు. మంచి, మర్యాదలు ఉండవు. అన్న విక్రయం జరుగుతుంది. ఆచార్యులు విద్యను బాహాటంగా అమ్ముతారు. వేదానికి, వేద విద్యలకు ఆదరణ సన్నగిల్లుతుంది. తల్లి దండ్రుల్ని ద్వేషించే పిల్లలుపుడతారు. పిల్లల్ని కబళించే స్త్రీ పురుషులుంటారు. కామమే తప్ప ప్రేమానురాగాలు

ఉండవు. అబద్ధాలు యెక్కువగా చెలామణి అవుతాయి. నీతి నిజాయితీ ఉండవు. ఈర్ష్య, అసూయ పెచ్చు పెరుగుతాయి.

ఇటువంటి విలక్షణాలతో కలియుగమానవులుఒకరిపైఒకరు విరుచుకు పడే వికృతిమితి మీరాక శ్రీమహావిష్ణువు కల్కి అవతారం యెత్తుతాడు. ఆయన సింహళంలోని శంభళ అనే గ్రామంలో విష్ణుయశుడు అనే పేరుగల బ్రాహ్మణుని యింట జన్మిస్తాడు.

దేవతలు యిచ్చిన మంచి గుర్రాన్నియెక్కి భూమండలం అంతా తిరుగుతాడు. దుష్టుల్ని, దొంగల్ని, ప్రజల్ని పీడించే ప్రభువుల్ని, పాలకుల్ని చంపుతాడు. శీలాన్ని అమ్ముకొని బ్రతికే స్త్రీలను ఉద్ధరిస్తాడు, సత్యవాక్పాలనం చేయిస్తాడు.

దయ, ధర్మ గుణాల్ని ప్రజలలో మేల్కొలుపుతాడు. ప్రజల్ని కంటికి రెప్పవలె కాపాడుతూ పాలించే మంచి పాలకుల్ని ఏర్పరుస్తాడు.

అప్పుడు మరల సత్యయుగం వస్తుంది. సూర్యవంశస్థుడయిన మరుత్తు చంద్ర వంశీయుడయిన దేవాపి తపస్సు పూర్తి చేసుకొని, కల్కి పురుషుని ఆజ్ఞను అనుసరించి రాజులవుతారు.

వీరిలో మరుత్తు ఇక్ష్వాకువంశీయుడు. దేవాపి భీష్ముని తండ్రి శంతనునికి అన్నగారు. ఆనాడు వారు రాజ్యాలు వదిలి తపస్సులకు వెళ్ళిపోయారు. వారు "కలాప" అనే చోట యోగనిష్ఠులై ఉన్నారు.

వారిని కల్కి మేల్కొలిపి కర్తవ్యం ఉపదేశిస్తాడు. అప్పుడు వారు చక్రవర్తులై సత్యయుగాన్ని స్థాపిస్తారు. మానవులు సదాచార సంపన్నులు అవుతారు. సత్యవర్తనులవుతారు. అదే కృతయుగం. భూమండలం సస్య సమృద్ధం అవుతుంది. సకాలంలో వర్షాలు పడతాయి. ఋతువులు సక్రమంగా తిరుగుతుంటాయి. మానవులు తుష్టి, పుష్టి కలిగి దివ్య తేజస్సుతో ప్రకాశిస్తారు.

కాలపురుషుడు, కాలహంతకుడు కాలకర్త అయిన శ్రీహరి నామ సంకీర్తనమే ఇహ పరసౌఖ్యాలనిస్తుంది. ఇది వ్యాస వచనం. ఇదే భాగవత ఆదేశం. ఇదే భారతీయుల విశ్వాసం.

సర్వం కృష్ణార్పణమస్తు.

